Phone : 41365

Grams : OFFSET



# PRASAD PROCESS

## PRIVATE LIMITED,

CHANDAMAMA BUILDINGS, MADRAS-26

...... Started in 1953 we have installed the latest types of Graphic Arts Machinery, employed the best Artists and Artisans who have been specially trained to execute the finest works for

YOU
and
THE TRADE .....

CALENDAR OR A CARTON..
POSTER OR A PACKAGE SLIP..
LABEL OR LETTER DESIGN..

..... DONE SUPERBLY
IN MULTICOLOR

*Bombay Office :*

101, Pushpa Kunj, 16-A, Road, Church Gate, Bombay-1

*Bangalore Representative:*

181, 6th Cross Road, Gandhinagar, Bangalore-9.
Phone : 6555



# నేర్చుకొనుటకు పసితనం ప్రతిబంధకంకాదు

సీతాకోక చిలుకలు ఎట్లు జీవిస్తున్నాయో ఈనాడు ఆమె తెలుసుకుంటున్నది. ప్రతిరోజూ జీవితమును గురించి ఆమె ఎక్కువగా తెలుసుకుంటున్నది. పళ్ల, పనుచిగుళ్ల భద్రతపట్ల రోజూ శ్రద్ధ వహించవలసిన విషయం కూడ మీరు ఆమెకు బోధించాలి. ఆమెకు వృద్ధాప్యంలో కూడ సహజమైన పళ్లుంటవి. మీ వివేకమును ఆమె సర్వదా స్మరించుకుంటూ, దంతక్షయం, పనుచిగుళ్ల బాధల బారినుండి తనను రక్షించినందుకు మీకు అభివందనాలు అర్పించుతుంది. మీ పిల్లలకు వారెప్పటికైనా నేర్చుకోవలసిన అత్యుత్తమమైన అలవాట్లను ఈనాడే బోధించండి- ఫోర్‌హన్స్' టూత్ పేస్టుతో రోజూ పళ్లు, పనుచిగుళ్లను తోముకుంటూ వుండాలి. అమెరికా యందలి దంతవైద్యుడు డాక్టర్ జె. ఆర్. ఫోర్‌హన్‌చే సృష్టించబడిన ఫోర్‌హన్స్' టూత్ పేస్టు ఒక్కటే ప్రపంచములో ఆరోగ్యవంతమైన గట్టి పనుచిగుళ్లకు, మెరిసే తెల్లని పళ్లకు అనుకూలించే ప్రత్యేక పదార్థములు గలది. ఆర్. జె. ఫోర్‌హన్, డి. డి. ఎస్. చికిత్సననుసరించిన "CARE OF THE TEETH AND GUMS" (ఇంగ్లీషులో) తపాలా ఖర్చుల నిమిత్తం 15 న. పై. తపాలా బిళ్లలను పంపండి: ఫోర్‌హన్స్' డెంటల్ ఎడ్వయిసరీ బ్యూరో, పోస్టు బ్యాగ్ నం. 10031, బొంబాయి-1.

## COUPON

Please send me a copy of
"CARE OF THE TEETH AND GUMS"
Name ..........
Address ..........
C.1 ..........



# ఊరగాయ పచ్చళ్లకు అమూల్యమైన నూనెలు

అగ్‌మార్కు కాబడిన ఎ.యస్.బ్రాండ్ చాయపప్పు నూనె







అగ్‌మార్కు కాబడిన మేన్షన్‌బ్రాండ్ నువ్వులనూనె

ముక్కనుమెత్తబడనీయవు
బూజుపట్టనీయవు.........
చాలకాలము నిలువయుంచును.
16, 4, 2. కిలోగ్రాంల డబ్బాలలో
పేకింగు చేయబడుచున్నవి.....
ఇండియన్ గవర్నమెంటువారి అగ్
మార్కు సీలునుగమనించికొనుడు.

డిస్ట్రిబ్యూటరు :
శ్రీ మాజేటి వీరరాఘవయ్యా
కమిషను మర్చంటు, శివాలయం వీధి,
విజయవాడ :: ఫోన్ నెం. 567

డిపోలు : శ్రీ జి. సుబ్బారావు
డాక్టరు వుళ్ళక్కి స్ట్రీటు, తెనాలి
శ్రీ బి. గోపాలకృష్ణమూర్తి
1-3-166, రాజామొదలియార్ స్ట్రీటు
కలాసిగుడ — సికింద్రాబాద్ — ఫోన్ 73228

MFRS, అంబటి సుబ్బన్న & కో. సామర్లకోట



# ఇప్పుడు!

విశా ప్రియమైన




(పొమేడ్ రూపంలో)

# ట్యూబ్

ప్యాకింగ్‌లో కూడా లభించుచున్నది






- చిందిపోదు
- పారుపోదు
- పగిలిపోదు.

కొద్ది జిగటగలది గనుక వనితలకు కూడా మంచిది

సోల్ ఏజెంట్లు మరియు ఎగుమతి దారు:
ఎమ్.ఎమ్. బంకట్‌వాలా, అహమదాబాద్.1
ఏజెంట్లు:
వి. నరోత్తమ్ అండ్ కొ., బొంబాయి-2 TEL

పాలయొక్క గుణములు గలిగిన...




మిఠాయిని మించినది... ఆహారము!

CFY-7-TEL

## ఎవరెస్ట్ టైనీటాట్ తో పిల్లలు ఉల్లాసంగా వెళ్ళుతున్నారు

ఒక షోకైన చిన్న వాక్యూం ఫ్లాస్కు–స్కూలుకు వెళ్లే పిల్లలు వారి కిష్టమైన వేడి లేక చల్లటి ఆహారాన్ని, పానీయాలను తీసుకు వెళ్లటానికి గాను ప్రత్యేకంగా డిజైను చెయ్యబడ్డది. ఈ టైనీటాట్ ఎవరెస్ట్ వాక్యూం ఫ్లాస్కులకు గల అన్ని విశిష్టాంశాలను, నాణ్యమైన సామగ్రిని కలిగియుంది. మీ బిడ్డకు స్వంతానికి ఒక టైనీటాట్ ను తెచ్చిపెట్టరా ? గర్వకారణమైన ఇట్టి వస్తువులు శక్తివంతమైన వ్యక్తిత్వాన్ని పొందగలట్లు అతని దృక్పథాన్నే మార్చ తోడ్పడగలవు. "బిడ్డ మనిషికి తండ్రి" అని కదా నానుడి!




**విక్టరీ ఫ్లాస్క్ కంపెని ప్రైవేట్ లిమిటెడ్,**

బొంబాయి ★ కలకత్తా ★ ఢిల్లీ ★ మద్రాసు

Vapi-6/63

## స్టాంపు ఆల్బమ్

( 3000 స్టాంపులకు చోటు కలది )

ఉచితము ప్రతి ఆల్బమ్‌తోను ప్రపంచపు అయా దేశాల 50 స్టాంపులు (ప్రారంభంలో)

వెల :

| | | |
|---|---|---|
| ఒకటి | .... | రు. 1-60 |
| పది | .... | రు. 12-50 |
| ఇరవై | .... | రు. 20-00 |

స్టాంపులు :

| | | | |
|---|---|---|---|
| 100 ప్రపంచపు రకరకాలన్ని | | | రు. 1-20 |
| 250 | ,, | ,, | రు. 3-50 |
| 500 | ,, | ,, | రు. 8-00 |
| 1000 | ,, | ,, | రు. 15-00 |

(కోరినచో 5000 వరకు పెద్ద ప్యాకెట్లు పంపబడును)

| | | | |
|---|---|---|---|
| 50 భారతదేశపు రకరకాలు | | | రు. 0-65 |
| 100 | ,, | ,, | రు. 1-50 |
| 200 | ,, | ,, | రు. 9-50 |

(కోరినచో 300, 400, 500 స్టాంపుల ప్యాకెట్లు పంపబడును)

పెద్దసైజు, సచిత్ర, వివిధ వస్తువుల స్టాంపులు

| | | |
|---|---|---|
| 25 | — | రు. 2-00 |
| 50 | — | రు. 5-50 |
| 100 | — | రు. 13-00 |
| 200 | — | రు. 30-00 |

ఆర్డరుతో సహా సొమ్ము పంపవలెను. వీ. పీ. పద్ధతి లేదు. పోస్టేజి ఉచితము (రిజిస్ట్రేషను చార్జి 55 న. పై. అదనము). ఉత్తర ప్రత్యుత్తరములు ఇంగ్లీషులోగాని, హిందీలోగాని జరుపవలెను.

మెసర్స్ జైనా స్టాంప్స్,
60 - A, కమలానగర్, ఢిల్లీ - 6.





మీ దగ్గు
త్వరగా
పోవును

ఛాతీ మరియు
గొంతుగ నొప్పికి

# పెప్స్‌ను

మీరు తీసుకోండి

పెప్స్‌ను చప్పరించి, నొప్పిని నివారించే చర్యను జరుపునట్టి అందలి శమనకరమైన ఆవిరులను పొందండి. అవి గొంతుగ నొప్పి, బ్రోంకైటిస్ దగ్గు మరియు జలుబును గలిగించే క్రిములను చంపుటకు సహాయపడును. పెప్స్ త్వరగా నివారణను గలిగించును.



FPY-63 TEL

ఇందులో హానికరమైన ఓషధులు లేవు.
పిల్లలకు సురక్షితంగా ఇవ్వవచ్చును.

బ్రోంకైటిస్,
గొంతుగ నొప్పి,
పడిశెము,
అధిక కఫము,
జలుబులు
మరియు దగ్గులను
త్వరగా నివారించును.

మందుల వ్యాపారులందరివద్ద అమ్మబడుచున్నది.

సి.ఇ. ఫుల్‌ఫోర్డ్ (ఇండియా) ప్రైవేట్ లి.

మద్రాసు రాష్ట్రమునకు సోల్ డిస్ట్రిబ్యూటర్లు :

M/s. మోతీ అండ్ కో.,
మద్రాసు - 1.



# ప్రశ్నోత్తరాలు

1. *డి. సి. సిద్ధేశ్వర్లు, నెల్లూరు*

త్రేతాయుగమునాటి రామాయణమును కలియుగములోని వాల్మీకి వ్రాసెనని తమరు [మార్చి] నెల విచ్చారు. వాల్మీకి కలియుగములోని వాడని ఎవరు పేర్కొన్నారు? ఏ సంస్కృత గ్రంథములో నీ విషయము కలదో సెలవిస్తారా, మహాశయా?

రామాయణంలో బౌద్ధుల ప్రసక్తి ఉన్నది. "యథాహి చోర స్స తథాహి బుద్ధః; తథాగతం నాస్తిక మత్ర విద్ధి." బౌద్ధులు కలియుగానికి చెందినవారనుకోవాలి గద. రామాయణ కథ జైన, బౌద్ధవాఙ్మయాలలో జానపదగాథగా కానవస్తున్నది. రావణుడి పేరు పురాణాలలో తప్ప, కౌటిల్యుడి అర్థ శాస్త్రానికి పూర్వం ఉండిన ఏ బ్రాహ్మణ, బ్రాహ్మణేతర సాహిత్యంలోనూ కనిపించదని చరిత్రకారులు చెబుతున్నారు. పుష్యమిత్రుడి కాలంలోనో, అగ్నిమిత్రుడి కాలంలోనో వాల్మీకి ఆస్థాన కవిగా ఉండి ఉండాలని రాహుల్ సాంకృత్యాయన్ అంచనా.

2. *షేక్ ఇస్మాయిల్, జగన్నాథపురం*

హనుమంతుణ్ణి సంహరించుటకు రావణుడు జంబుమాలిని గాడిదల రథ మెక్కి పంపించినాడు అని వ్రాసినారు. రావణునకు గుర్రములు లేకనా?

సీతను ఎత్తుకుపోవటానికి రావణుడు కూడా గాడిదల రథమే ఎక్కి వెళ్ళాడు. ఆ కాలంలో దక్షిణ భారతంలో గాడిదలే పరిపాటిగా ఉండేవేమో!

3. *కె. కుమారస్వామి, దేవగుప్తం*

అన్నయ్యా, "రాకాసిలోయ" సీరియల్ అయిపోయిం తరువాత మరే దయినా నిర్ణయించారా? నిర్ణయిస్తే పేరు తెలుప గోర్తాను.

ప్రసిద్ధ బెంగాలీ రచయిత రచించిన "దుర్గేశనందిని" సీరియల్‌గా వెలువడుతుంది.

4. *జి. దక్షిణామూర్తి, వరంగల్లు*

సూర్యు డుదయించినప్పుడు భూమికి దగ్గరగా ఉంటాడా? లేక మిట్ట మధ్యాహ్నము వేళనా?

ఉదయ మధ్యాహ్నాల లోపల భూమికీ సూర్యుడికీ మధ్య ఉండే దూరంలో మార్పేమీ రాదు. కాని భూమి మీద ఉండే మనకు మిట్టమధ్యాహ్నం వేళనే సూర్యుడు సుమారు 4,000 మైళ్ళు దగ్గరగా ఉంటాడు. 930 లక్షల మైళ్ళ దూరంలో ఈ 4 వేలు లెక్కా జమా అన్నది వేరే విషయం.

5. వడాది సత్యనారాయణమూర్తి, అనపర్తి

**రాకెట్‌లో పైకి వెళ్ళేటప్పుడు పైన గల శీతోష్ణస్థితికీ, భూమి మీద శీతోష్ణ స్థితికీ తేడా ఉంటుందా? మరియు అచట ఆక్సిజన్ లభ్యమవుతుందా?**

శీతోష్ణస్థితి భిన్నంగా ఉంటుంది; ఆక్సిజన్ లభ్యంకాదు, అందుచేత వాటిని రాకెట్‌లోనే ఏర్పాటు చేసుకోవాలి.

6. ఆర్. రవీంద్రనాథ్, అనంతపూరు

**జూల్స్‌వెర్న్ తన నవలల ద్వారా శాస్త్రవిజ్ఞానాన్ని ప్రజల కందజేశాడు. అతని నవలల్ని సినిమాలుగ కూడ తీశారు. మీరీ బేతాళ కథలను ప్రచురించడం మాని విజ్ఞానదాయకమైన జూల్స్‌వెర్న్ నవలొకటి ప్రారంభించ గూడదా?**

ఈ స్పూత్నిక్ యుగంలో విజ్ఞానం కోసం జూల్స్‌వెర్న్ నవలలను ఎవరూ చదవరు. అవి సినిమాలు తీయటానికే ఎక్కువగా ఉపయోగపడతాయి. జూల్స్‌వెర్న్ నవలలు అనేకం తెలుగు పత్రికలలో ఇదివరకే వెలువడ్డాయి. బేతాళ కథలకు జూల్స్‌వెర్న్ నవలలు ఏ విధంగా ప్రత్యామ్నాయమవుతాయో మాకు బోధపడలేదు.

7. ఎల్. రామచంద్రన్, తిరుమల

**స్త్రీలకు విద్య అవసరమా, అనవసరమా?**

స్త్రీలకు తిండీ, బట్టా, ఆరోగ్యమూ, ఇళ్ళూ, వినోదాలూ, ఆటలూ, పాటలూ— అన్నీ అవసరమైనప్పుడు విద్య ఒకటీ అనవసరమవుతుందా?

8. సలాది కనకారావు, బి.ఎస్‌సి., విజయవాడ

**మానవుడు ఇతర గ్రహములలోనికి పోయి ఎప్పటికైన నివసించునా? అట్టి మానవుడు తిరిగి భూలోకమునకు రాగలడా? భూప్రళయ సందర్భములో మానవులు చావును తప్పించుకొనుటకు ఇతర గ్రహములు ఉపయోగపడునా?**

ప్రస్తుతం జరిగే అంతరిక్షయాన ప్రయోగాల ఆశయాలలో మానవుడు పరిమిత కాలంపాటైనా ఇతర గ్రహాలలో నివసించ గలగటమనేది ఒకటి. అయితే మానవుడికి తన చుట్టూ ఉండే వాతావరణాన్ని తన కనుకూలంగా మార్చుకునే శక్తి కొద్దిగా ఉన్నదిగాని, ఇతర వాతావరణాల కనుగుణంగా మారేశక్తి లేదు. అందుచేత ఇతర గ్రహాలలో నివసించటమంటే అక్కడి వాతావరణాన్ని మనిషికి అనుకూలంగా మార్చుకో గలగటమన్న మాట. ఇందుకు తగిన సౌకర్యాలున్నప్పుడు మనిషి ఇతర గ్రహాలలో ఉండగలుగుతాడు. ఏ కారణంచేతనైనా భూమి వాసయోగ్యం కాకుండాపోతే ఆ సమయానికి ఇతర గ్రహాలు వాసయోగ్యమై ఉండి, భూమి మీద జనమంతా ఆ గ్రహాలకు తరలి వెళ్ళటానికి తగిన యానసౌకర్యాలున్నట్టయితే మానవులు చావును తప్పించుకోవచ్చు. భూమిని వదిలి ఇతర లోకాలకు వెళ్ళేవారు తిరిగి అక్కడి నుంచి రాలేకపోవట మన్నది ఉండకపోవచ్చు.



# మండు వేసవిలో పగటి కలలు ...

ఇంట్లో **కాస్సెల్స్** చల్లని గాలి
వీస్తూవుంటే ఎంతో సుఖం, ఎంతో హాయి



అమ్మకందార్లు :
ఎలెక్ట్రికల్స్ లిమిటెడ్
లక్డీకాపూల్ రోడ్, హైదరాబాద్



మీ కలల పంట **కాస్సెల్స్** ఫ్యాన్!

heros'-BE 160 E TE



నిరాల

ఎక్కువ బట్టలను
శుభ్రపరచును



నిరాల

బట్టలను ఎక్కువ
తెల్లగా చేయును



నిరాల

వాటిని తొందరగా
శుభ్రపరచును







తుంగభద్ర ఇండస్ట్రీస్ లి. కర్నూలు

ASP/N-5



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచిక నుంచీ ప్రహ్లాదుడి కథ అట్ట చివరి బొమ్మగా వెలువడుతున్నది. ఈ కథ నాలుగు మాసాలు నడుస్తుంది. ప్రహ్లాదుడి కథ విష్ణువు యొక్క మూడు అవతారాలతో సంబంధం గలది.

ఈ సంచికలోనే సుందరకాండ [రామాయణం] పూర్తి అవుతున్నది. రామాయణానికంతకూ రసవత్తరమైన ఈ సుందరకాండకు నాయకుడు హనుమంతుడు. అందుకే ఈ ఏడు మాసాల పాటూ దాదాపు ప్రతి బొమ్మలోనూ హనుమంతుడున్నాడు.

సంపుటి 34 మే 1964 సంచిక 5



# భారత చరిత్ర



*ఖాన్‌దేశ్*

**ము**హమ్మద్ బిన్ తుఘ్లక్ సామ్రాజ్యంలో ఖాన్‌దేశ్ ఒక భాగంగా ఉండేది. దానికి పాలకుడైన మలిక్ రాజా ఫారూకీ, ఫీరూజ్ షా అనంతరం చెలరేగిన అల్లకల్లోలంలో స్వాతంత్ర్యం ప్రకటించాడు.

ఇతను 1399 ఏప్రిల్ 29న పోగా, ఇతని కొడుకు మలిక్ నసీర్ రాజ్యానికి వచ్చి, గుజరాతు, బహమనీ పాలకుల చేతుల్లో ఓడిపోయి 1437-38 లో చనిపోయాడు. 1438 మొదలుకుని 1501 దాకా ఖాన్‌దేశ్‌ను ఇతని కొడుకూ, మనమడూ, మునిమనమడూ ఏలారు. చివరకు గుజరాతు లాగే ఖాన్‌దేశ్ కూడా 1601 లో అక్బరు సామ్రాజ్యంలో ఐక్యమయింది.

*బహమనీ రాజ్యం*

ఢిల్లీని ధిక్కరించి స్వాతంత్ర్యం ప్రకటించిన ముస్లిము రాజ్యాలన్నిటిలోకీ అత్యంత బలీయమైనది దక్కనులోని బహమనీ రాజ్యం. అది "పిచ్చి" తుఘ్లక్ కాలంలో స్వతంత్రమయింది. దక్కనులోని ప్రముఖులు దౌలతాబాదును పట్టుకుని, తమలో ఒకడైన అఫ్ఘాను వాణ్ణి నాసిరుద్దీన్ షా అనే పేరుతో గద్దె ఎక్కించారు. ఇతను రాజ్యం చేయలేక, తానై సింహాసనాన్ని జఫర్‌ఖాన్ అనే వాడి కిచ్చేశాడు. ఇతను అబుల్ ముజఫర్ అలాఉద్దీన్ బహ్మన్ షా అనే పేరుతో 1347 ఆగస్టు 3న రాజ్యాభిషేకం చేసుకున్నాడు. ఇతని సంతతి వారే బహమనీ రాజులు.

ఇతను తన రాజధానిని గుల్బర్గాకు మార్చాడు; తన అధికారాన్ని ఆమోదించని దక్కను హిందూ రాజులను ఓడించాడు. ఇతను 1358 ఫిబ్రవరి 11న చనిపోయే నాటికి ఇతని సామ్రాజ్యం ఉత్తరాన వైనగంగ నుంచి దక్షిణాన కృష్ణ వరకూ, పడ

మర దౌలతాబాదు నుంచి, తూర్పున భువన గిరి (తెలంగాణం) వరకూ విస్తరించింది. ఇతను అవసానదశలో తన కొడుకును గద్దెకు నియమించాడు. అతని పేరు ముహమ్మద్ షా.

ముహమ్మద్ షా 1377 లో చనిపోగా అతని కొడుకు ముజాహిద్ షా రాజ్యానికి వస్తూనే విజయనగరం పైకి దండెత్తి వెళ్ళి, నగరాన్ని లోబరుచుకోలేక విజయనగర రాజుతో సంధి చేసుకుని తిరిగి వచ్చాడు. ఇతని తరువాత రెండవ ముహమ్మద్ షా రాజుగా చేయబడ్డాడు.

ఇతని అనంతరం 1397 నవంబరులో రాజైన తాజుద్దీన్ ఫీరూజ్ షా విజయనగర రాజుతోనూ, దక్కనులోని ఇతర హిందూ రాజులతోనూ యుద్ధాలు చేశాడు. విజయ నగర రాజకుమార్తెను నిర్బంధంగా తన అంతఃపురకాంతలలో చేర్చుకున్నాడు. కాని 1420 లో ఇతనికి విజయనగర రాజు చేతిలో పానగల్లు వద్ద ఓటమి సంభవించింది. ఈ అపజయానికి ప్రతికృతిగా, ఇతని తమ్ముడు అహ్మద్ షా రాజ్యానికి వచ్చి విజయనగరంతో భయంకరమైన యుద్ధం చేసి జయించాడు. 1424 ప్రాంతంలో ఇతని సేనాపతి వరంగలు



రాజ్యం పైకి దండెత్తి వెళ్ళి కోటను పట్టుకుని, రాజును చంపాడు. అహ్మద్ షా 1435 ఫిబ్రవరిలో పోయాడు.

అటు తరువాత బహమనీ రాజ్యంలో కలతలూ, చీలికలూ ఏర్పడ్డాయి. ముస్లిములలోనే షియా, సున్నీ విభేదాలు తల ఎత్తాయి, ఎన్నో కుట్రలూ కుహకాలూ జరిగాయి. అయినప్పటికీ 1527 దాకా బహమనీ రాజుల పరిపాలన కొన సాగింది.

*దక్కను సుల్తానులు*

బహమనీ సామ్రాజ్య విచ్ఛిత్తితో దక్కనులో అయిదు సల్తనతు లేర్పడ్డాయి. వీటిని పాలించిన వారు : బిరారులో ఇమాద్

షాహీ, అహ్మదృగరులో నిజామ్ షాహీ, బిజాపూర్‌లో ఆదిల్ షాహీ, గోల్కొండలో కుత్బ్ షాహీ, బీదర్‌లో బారీద్ షాహీ వంశాలవారు.

1484 లో మొట్టమొదటగా బిరార్ స్వతంత్రమయింది; ఇది 1574 లో అహ్మద్‌నగర్‌లో లీనమయింది. 1489-90 లో యూసుఫ్ ఆదిల్‌ఖాన్ బిజాపూర్‌ను స్వతంత్రంగా ప్రకటించాడు. ఆదిల్‌షాహీ వంశంలో ఇతని తరువాత చెప్పుకోదగిన సమర్థుడు రెండవ ఇబ్రాహీం ఆదిల్ షా. 1686 లో ఔరంగజేబ్ బిజాపూర్ రాజ్యాన్ని అధీనం చేసుకున్నాడు.

అహ్మద్‌నగర్‌ను స్వతంత్రంగా ప్రకటించిన వాడు మలిక్ అహ్మద్ (1490). 1499 లో ఇతను దౌలతాబాదును జయించి తన రాజ్యాన్ని బలిష్ఠం చేసుకున్నాడు. అహ్మద్ షాహీ రాజుల పరిపాలనలో చెప్పుకోదగినవి: 1550 లో నిజామ్ షా బిజాపూర్‌ను ఎదిరించటానికి విజయనగర రాజుతో చేరాడు; ఇతని తరువాత వచ్చిన వాడు 1565 లో విజయనగరానికి విరుద్ధంగా ఏర్పడిన కూటంలో చేరాడు; 1576 లో అక్బరు కొడుకు మురాద్ దాడిని చాంద్ బీబీ వీరోచితంగా ప్రతిఘటించింది; 1600 లో మొగలులు ఈ రాజ్యంపై దాడి చేశారు; 1633 లో షాజహాన్ దీనిని తన సామ్రాజ్యంలో కలుపుకున్నాడు.

బహమనీ సుల్తానులు ధ్వంసం చేసిన వరంగల్లు రాజ్యపు శిథిలాలపై గోల్కొండ రాజ్యం ఏర్పడింది. దీన్ని పాలించిన కుత్బ్ షాహీ వంశాన్ని స్థాపించినవాడు కులీషా. 1565 లో విజయనగర వ్యతిరేక కూటమిలో చేరిన సుల్తానులలో ఇతని కొడుకు ఇబ్రాహీం కూడా ఉన్నాడు. ఇతను హిందువులకు పెద్ద పదవు లిచ్చాడు.

1687 లో ఔరంగజేబ్ గోలకొండను ముట్టడించి, జయించి మొగలు సామ్రాజ్యంలో చేర్చుకున్నాడు.





# ప్రహ్లాదుడు

బ్రహ్మ మానస పుత్రులైన సనకసనందనాదులు మూడు లోకాలూ తిరుగుతూ ఒకనాడు తలవని తలంపుగా విష్ణు లోకానికి వెళ్ళారు. అయిదేళ్ళ పిల్లల లాగా, దిగంబరులై ఉన్న ఆ వృద్ధ మహామునులను చూసి విష్ణువు యొక్క ద్వారపాలకులైన జయ విజయులు అడ్డగించి, లోపలికి పోనిచ్చారు కారు. దానికి అలిగి ఆ మునులు ద్వారపాలకులను రాక్షస జన్మ లెత్తమని శపించారు.

శాపానికి భయపడి జయవిజయులు శాపమోక్షణం దయచెయ్యమని మునులను వేడుకున్నారు. మూడు జన్మల అనంతరం వారికి తిరిగి విష్ణులోక ప్రాప్తి కలిగేటట్టుగా అనుగ్రహించి మునులు తమ దారిన తాము వెళ్ళారు. ఆ శాపం ఫలితంగా వారు మొదటి జన్మలో కశ్యపుడికి దితి గర్భాన హిరణ్యకశిప హిరణ్యాక్షులై జన్మ ఎత్తారు.

హిరణ్యాక్షుడు యుద్ధాసక్తి గల వాడు. తనతో యుద్ధం చేయమని అతను వరుణుణ్ణీ ఇంకా ఇతరులనూ పిలిచాడు. కాని ఎవరూ అందుకు సిద్ధ పడలేదు. అతను భూమిని చుట్టి పాతాళంలో పడేసినప్పుడు విష్ణువు యజ్ఞ వరాహావతారమెత్తి భూమిని పైకి తెచ్చాడు. హిరణ్యాక్షుడా వరాహంతో తలపడి, యుద్ధం చేసి చచ్చాడు.

విష్ణువు తన తమ్ముణ్ణి చంపినందుకు హిరణ్యకశిపుడికి పట్టరాని కోపం వచ్చింది. అతను సభలో దానవ వీరుల నుద్దేశించి కోపాతిరేకంతో మాట్లాడుతూ, "మాయా రూపంలో వచ్చి నా తమ్ముణ్ణి చంపిన ఆ విష్ణువును నా శూలానికి గుచ్చి, అతడి రక్తంతో నా తమ్ముడికి తర్పణం చేస్తాను. ఈ లోపల మీరు ప్రపంచ మంతటా తిరిగి తపస్సూ, యజ్ఞాలూ, వేదాధ్యయనమూ, వ్రతాలూ, దానాలూ చేసే వారి నందరినీ

అట్ట చివరి బొమ్మ

చంపండి. గోబ్రాహ్మణ పూజలూ, వర్ణాశ్రమ విధులూ సక్రమంగా సాగే గ్రామాలన్నిటినీ తగలబెట్టండి," అని హెచ్చరించాడు.

రాక్షసులు విజృంభించి సంచరిస్తూ ప్రజల పైన పడి హత్యాకాండ సాగించారు. పురాలనూ, గ్రామాలనూ, రాజధానులనూ, మందలనూ, తోటలనూ, పొలాలనూ, ఆశ్రమాలనూ విధ్వంసం చేశారు.

హిరణ్యకశిపుడు చచ్చిన తమ్ముడికి ఉత్తరక్రియలు చేసి, తన తల్లినీ, తమ్ముడి భార్యనూ, కొడుకులనూ ఊరడించి, తనకు అపజయం గాని, ముసలితనం గాని, చావు గాని లేకుండా చేసుకుని, లోకాలన్నిటికీ తానే రాజు కావాలన్న కాంక్షతో తపస్సు చేయబోయాడు.

అతను మందరగిరి యొక్క లోయలో కాలి బొటనవేలిపై నిలబడి, చేతులు పైకెత్తి పరమ దారుణమైన తపస్సు చేశాడు. అతని శరీరం యొక్క వేడి అన్ని లోకాలకూ వ్యాపించింది. సముద్రాలు ఘోషించాయి. భూమి కంపించింది.

దేవతలు హిరణ్యకశిపుడి తపశ్శక్తికి తట్టుకోలేక బ్రహ్మ లోకానికి పరిగెత్తిపోయి, హిరణ్యకశిపుడి తపస్సు ఏదోవిధంగా నిలుపు చెయ్యమని బ్రహ్మను వేడుకున్నారు. అందుకు బ్రహ్మ సమ్మతించాడు.



బ్రహ్మ వెళ్ళి చూసేసరికి హిరణ్యకశిపు డెక్కడ ఉన్నదీ కూడా తెలియరాలేదు. అతని చుట్టూ పుట్ట పెరిగింది. దాన్నిండా గడ్డీ, వెదురుదుబ్బులూ ఉన్నాయి. హిరణ్య కశిపుడి శరీరాన్ని చీమలు తినేశాయి. బ్రహ్మ అతని స్థితిచూసి ఆశ్చర్యపడి, "హిరణ్యకశిపూ, నీ తపస్సు ఫలించింది, లేచిరా ! నీ కేం వరం కావాలో కోరుకో !" అంటూ తన కమండల జలం హిరణ్యక శిపుడి శరీరం పైన చల్లాడు.

వెంటనే హిరణ్యకశిపుడు బంగారంలాగా వెలిగిపోతున్న శరీరంతో, యౌవనంతో నిండినవాడై పుట్టలో నుంచి పైకి వచ్చాడు. అతను హంస వాహనం ఎక్కి ఆకాశంలో కనిపించే బ్రహ్మకు సాష్టాంగ నమస్కారం చేసి, స్తుతించి, "నేను కోరిన వర మివ్వ దలిస్తే, నీవు సృష్టించిన భూతాలలో దేని వల్లా నాకు చావు లేకుండా వరమియ్యి. లోపలగాని, వెలపలగాని, రాత్రిగాని, పగలు గాని, భూమిపైగాని, ఆకాశంలోగాని, నీవు సృష్టించని వాటి చేతగాని, ఆయుధాల చేత గాని, మానవులచేతగాని, ప్రాణం లేని వాటి చేతగాని, ప్రాణంగల వాటి చేతగాని, సురా సురుల చేతగాని, మహోరగుల చేతగాని నాకు చావు లేకుండానూ, యుద్ధంలో నాకు అపజయం లేకుండానూ, రాజరికంలో



నాకు ఎదురు లేకుండానూ, దేవతల కుండే అష్ట ఐశ్వర్యాలూ నా కుండేటట్టూ వర మియ్యి," అని వేడుకున్నాడు.

బ్రహ్మ హిరణ్యకశిపుడికి అతను కోరిన వరాలన్నీ ఇచ్చి తన లోకానికి తిరిగి వెళ్ళిపోయాడు.

బ్రహ్మ నుంచి అపూర్వమైన వరాలు పొంది, శరీరం బంగారు రంగులో మెరిసి పోతూ, తన తమ్ముడి చావుకు కారకుడైన విష్ణుని ద్వేషిస్తూ అతను త్రిలోక దిగ్విజ యానికి పూనుకున్నాడు. దేవ, రాక్షస, మనుష్య, గంధర్వ, గరుడ, ఉరగ, సిద్ధ, చారణ, విద్యాధర, యక్ష, రాక్షస, భూత, ప్రేత గణ రాజులూ, ఋషులూ, మునులూ అతనికి వశులయారు. విశ్వకర్మ నిర్మించిన స్వర్గం అతనికి నిలయమయింది. లోక పాలకు లతనికి పాదవందనాలు చేశారు, సిద్ధ గంధర్వ విద్యాధరాప్సరసలు అతని ముందు నృత్యాలు చేశారు.

విశ్వావసు తుంబుర నారదులు అతని కీర్తిని గానం చేశారు. భూమ్యాకాశాలూ, నదులూ, సప్త సముద్రాలూ, అతని ఆజ్ఞ ప్రకారం నడుచుకున్నాయి.

ఒక్క త్రిమూర్తులు తప్ప అతని ఆజ్ఞకు లోబడని వారు లేరు.

దిక్పాలకులు మొదలైన వారు దిక్కు తెలియక విష్ణుమూర్తిని శరణుజొచ్చారు. వారి మొర లాలకించిన హరి అశరీరవాణి రూపంలో, "భయపడకండి. కొంచెం ఓపిక పట్టండి. ఆ రాక్షసుడి సంగతి నాకు తెలుసు. నేను వాడి మదం అణగిస్తాను. వాడు తన కొడుకైన ప్రహ్లాదుణ్ణి హింసించే టప్పుడు, బ్రహ్మ ఇచ్చిన వరాలకేమీ భంగం కలగకుండా నేను వాణ్ణి చంపేస్తాను," అని అభయం ఇచ్చాడు.

విష్ణువు చెప్పిన ఈ మాటలకు తృప్తి పడి దేవతలు తమ తమ నివాసాలకు వెళ్ళిపోయారు. —(ఇంకావుంది)






## 35

[ కేశవుడూ వాళ్లు రాకాసిలోయలోకి దిగి, పులిరాజును చంపారు. అదే సమయంలో బ్రహ్మదండి మాంత్రికుడు అక్కడికి వచ్చి, జగభోజిని వెంటబెట్టుకుని, లోయ మధ్యకు బయలుదేరాడు. కల్పకవల్లి బంధింపబడిన గుహను కాపలా కాస్తున్న కింకరుడి మెడకు, కేశవుడు ఉచ్చు బిగించాడు. జయమల్లు గుహను సమీపించాడు. —తరవాత ]

జయమల్లు గుహ ముందుకు వెళ్ళి, "ఓ రాకుమారీ కల్పకవల్లీ! యివే నీకు మా నమస్సులు. ఇక్కడ వున్న ముగ్గురం కూడా మీ దేశ పౌరులమే. కేశవుడని పిలవబడే యువకుడు, మా నాయకుడు. నా పేరు జయమల్లు; గోమాంగ్ మా స్నేహితుడు. దుష్టుల సలహా విని, మీ తండ్రి మమ్మల్ని దేశద్రోహులుగా ప్రకటించినా, మేము ఎప్పటికీ దేశభక్తులమే. దుష్టులైన బ్రహ్మదండి, జగభోజి మాంత్రికులను సంహరించబోతున్నాం. మీ ఆజ్ఞ ఏమిటో సెలవివ్వండి!" అన్నాడు.

జయమల్లు యిలా అనగానే గుహలో చిన్న సవ్వడి అయింది. ఆ వెంటనే, ఉదయసూర్యుని కాంతిలో, ధగధగా మెరిసిపోతూ, పదహారు పదిహేడేళ్ళ జవ్వని గుహలో నుంచి బయిటికి వచ్చింది. ఆమె రూపలావణ్యాలు కేశవుడి కళ్ళకు మిరు



మిట్లు కొల్పినై. అతడు జంత్రపు బొమ్మలా రాకుమారి కేసి చూస్తూ నిలబడిపోయాడు.

కల్పకవల్లి గుహ నుంచి బయిటికి వచ్చి, కేశవుడి కేసీ, అతడి చేతిలో బందీగా వున్న కింకరుడి కేసీ ఓమారు చూసి, జగభోజి బలవంతంగా తన తల మీద ముడివేసిన దంతపు కిరీటాన్ని లాగి, దూరంగా విసిరి వేస్తూ, "మీ సహాయం వల్ల నేను ఈ దుష్టుల బారి నుంచి బతికి బయటపడ్డాను. మీ రాజ భక్తి నాకు తెలియంది కాదు. బ్రహ్మదండి కల్పించిన కట్టు కథలు నమ్మి, నా తండ్రి మిమ్మల్ని అనుమానించాడని నాకే కాదు, రాజ్యంలో వున్న చాలా మందికి కూడా తెలుసు. మీరు, నన్ను కాపాడిన వాళ్ళు గనక, మిమ్మల్ని ఆజ్ఞాపించే హక్కు నాకు లేదు. నాకూ, ఒక ఆయుధం యివ్వండి. లోయలోకి వెళ్ళిన ఆ దుష్టుల్ని వేటా డేందుకు, నేనూ వస్తాను," అన్నది.

కేశవుడు మారు మాటాడకుండా, తన దగ్గిర వున్న కత్తిని కల్పకవల్లికి అందిస్తూ, "రాకుమారీ! ఈ కత్తి మీరు తీసుకోండి, ఈ బాణాలు నాకు చాలు!" అన్నాడు.

జయమల్లు కేశవుడి చేతిలోంచి అడవి తీగ ఉచ్చును అందుకుని, కింకరుడి కేసి పళ్ళు కొరుకుతూ చూసి, "కింకరా! నీకు, నీ ప్రాణ మంటే ఎక్కువ తీపా? లేక నీ గురువు రక్షణ ఎక్కువ తీపా?" అని అడిగాడు.

"మహాగురో, నన్ను చంపకండి! నా కీ భూప్రపంచంలో, నా ప్రాణాని కన్న ఎక్కువ మధురమైందీ, విలువైందీ మరేం లేదు," అన్నాడు కింకరుడు ఏడుపు గొంతుతో.

"అయితే, నువ్వు ఆ ధనరాసులున్న రావిచెట్టు దగ్గిరకు దారి తియ్యి. మోసం చెయ్య ప్రయత్నించావో, నీ గొంతుకు ఉరి బిగుసుకుంటుంది," అన్నాడు జయమల్లు.

"మహాప్రసాదం, గురుదేవరా! ఆ చెట్టు దగ్గిరకు సూటిగా వెళ్ళే దారి తియ్య

మన్నారా? చుట్టు తిరిగి వెళ్ళే దారి తియ్య మన్నారా?" అని అడిగాడు కింకరుడు.

"ఏ దారైనా తియ్యి. నీ గురువుకూ, వాడి వెంట వున్న పిశాచాలకూ మాత్రం మనం అక్కడికి వస్తున్న సూచన తెలియ కూడదు," అన్నాడు జయమల్లు.

"ధన్యుణ్ణి, గురుప్రభో! అలాగే చేస్తాను. మీ పనైన తరవాత మాత్రం, నా గొంతు బిగించి చంపకండి," అంటూ కింకరుడు దారి తీశాడు.

ఆ తరవాత వాడు వాళ్ళను లోయ మధ్యకు తీసుకుపోయాడు. అక్కడ ఒక చెట్టు కింద వాడాగి, దూరంగా కనిపిస్తున్న ఒక ఎత్తయిన రావిచెట్టును జయమల్లుకు వేలితో చూపుతూ, "అదే, రాకాసిలోయలో అంతులేని ధనరాసులున్న రావిచెట్టు. దాని పాదంలో ఒక పాము పుట్ట వున్నది. నేనూ, నా పాత గురువూ దానిని ఎప్పుడో గుర్తించి, ఆ ధనరాసుల మీద హక్కున్న జాతకుడి కోసం ఎదురుచూస్తున్నాం," అన్నాడు.

గోమాంగ్ యిచ్చిన కత్తి తీసుకుని, కేశవుడు రావిచెట్టు కేసి బయలుదేరాడు. జయమల్లూ తతిమ్మా వాళ్ళంతా, అతడికి కొంచెం వెనకగా చెట్లచాటున నక్కుతూ కదిలారు. కింకరుడి మెడకు బిగించి వున్న



తీగను లాగి పట్టుకుని, కోయగోమాంగ్ అతడి వెన్నంటి నడుస్తున్నాడు.

కేశవుడు రావిచెట్టును సమీపించాడు. ఆ చెట్టు మొదట్లో ఒక పెద్ద పుట్ట వున్నది. చెట్టు పైన వున్న గండభేరుండపక్షులు కేశవుడు అక్కడికి రావటం చూస్తూనే, రెక్కలు టపటపలాడిస్తూ, కర్ణకఠోరంగా అరిచినై. కేశవుడు పుట్ట దగ్గిరకు వెళ్ళి, కత్తితో దాని మీద గట్టిగా రెండుసార్లు కొట్టాడు. ఆ వెంటనే ఒక పెద్ద కలుగులో నుంచి మహాసర్పం ఒకటి పడగ విప్పి బుసలు కొడుతూ బయిటికి వచ్చింది. ఒకవేళ ఆ సర్పం తన మీదికి వస్తుందేమో అన్న అనుమానంతో

కేశవుడు కత్తి ఎత్తి పట్టుకుని, దాని కేసి ఒకడుగు వేశాడు. సర్పం బుసలు కొట్టటం మాని తల వంచుకుని పుట్ట మీంచి దిగి, దూరంగా పోసాగింది. రావిచెట్టు మీద వున్న గండభేరుండాలు కొన్ని వికృతంగా అరుస్తూ, దాని మీదికి దూకినై.

మహాసర్పం పెట్టే బుసలూ, దానిని తన్నుకుపో చూస్తున్న గండభేరుండాలు చేసే రొదా ఓక్షణకాలం చూసి, కేశవుడు తన కత్తితో పుట్టను తవ్వసాగాడు. ఒకటి రెండు నిమిషాలు నిశ్శబ్దంగా గడిచింది. హఠాత్తుగా దాపులనున్న చెట్ల వెనక నుంచి కలకలం బయలుదేరింది. కొరడా ఛెళ్ళు మన్నట్టు పెద్ద ధ్వని అయింది. కేశవుడు ఆ ధ్వని వచ్చిన వైపుకు చూశాడు.

బ్రహ్మదండి మాంత్రికుడూ, జగభోజీ— వాళ్ళ వెనకగా పులుగురాయుడూ, స్థూల కాయుడూ, జితశక్తివర్మలూ చెట్లచాటు నుంచి పెద్దగా అట్టహాసం చేస్తూ బయిటికి వచ్చారు. కేశవుడు కంట బడగానే, బ్రహ్మదండి మాంత్రికుడు పెద్దగా నవ్వుతూ, "వత్సా కేశవా! నిన్ను కోటీశ్వరుణ్ణి చేయటానికి నే నెన్ని అవస్థలు పడ్డాను! మొత్తం మీద, ఈ చెట్టు పాదంలో వున్న నిధి నిక్షేపాలకు హక్కుదారువైన జాతకుడివి రానే వచ్చావు. కాలభైరవుడు చెప్పిన దంతా సత్య



మైంది. ధనాన్ని కాపలాకాసే మహాసర్పం, అంతా నీ పరం చేసి పక్కకు తప్పుకున్నది. ఇక నువ్వడ్డం తొలుగు," అంటూ కేశవుడి కేసి రాసాగాడు. జిత శక్తివర్మలు కత్తులు దూశారు. స్థూలకాయుడు కొరడా ఎత్తి పట్టుకున్నాడు. పులుగురాయుడు చెట్టు మీద వున్న గండభేరుండాల కేసి ఆశగా చూశాడు.

కేశవుడు కత్తి తీసుకుని లేచి నిలబడి, బ్రహ్మదండినీ, అతడి అనుచరవర్గాన్నీ చూస్తూ, "మీరంతా, వున్న చోటునే ఆగండి. ఒక్కడుగు ముందుకు వేశారో, నిలువునా నరికేస్తాను," అన్నాడు, రౌద్రం వుట్టి పడుతున్న గొంతుతో.

ఆ మాటలకు బ్రహ్మదండీ, జగభోజీ పొట్టలు పట్టుకుని నవ్వారు. "మా గరుడ వంశం వాళ్ళ దెబ్బ వీడికి తెలీదు!" అన్నాడు పులుగురాయుడు.

"నా పూర్వ బానిస యింత ధైర్యంగా మాట్లాడుతున్నాడంటే, అందు కేదో మంచి కారణమే వుంటుంది. ఇక్కడ జరగబోయే రక్తపాతంలో నాకు భాగం వద్దు," అంటూ స్థూలకాయుడు, కొరడాను భుజానికి తగిలించుకున్నాడు.

జిత శక్తివర్మలు ముందుకు వస్తూ, "ఒకళ్లం వీడి తలా, ఒకళ్ళం వీడి కాళ్ళూ—ఒక్క వేటుకు నరికేద్దాం," అన్నారు.





కేశవుడు జిత శక్తివర్మల కేసి ఒకడుగు వేసేంతలో, "గురు మౌనానందుడికీ, జై!" అన్న కేకలు వినిపించినై. ఆ మరుక్షణం లోనే ముసలివాడూ, బిడాలీ శ్వానకర్ణీ కొద్ది మంది తమ అనుచరులతో, చెట్లచాటు నుంచి బయిటికి వచ్చారు. వాళ్ళను చూస్తూనే, "హాఁ కాలభైరవా!" అంటూ బ్రహ్మదండి మరోవైపుకు పరిగెత్తబోయాడు. అటు నుంచి, జయమల్లు తన అనుచరులతో చెట్లచాటు నుంచి బయిటికి వచ్చి, బ్రహ్మదండి బలగాన్ని చుట్టు ముట్టాడు.

చేత కత్తిబట్టి ముందుకు వస్తున్న రాకుమారి కల్పకవల్లిని చూస్తూనే, జగభోజి, "అరే, మోసం! నా కాబోయే భార్య గుహ నుంచి ఎలా బయటపడగలిగింది? ఆ ద్రోహి కింకరు డెక్కడ?" అంటూ అరిచాడు.

"కింకరు డిక్కడే వున్నాడు, గురో! గొంతుకు ఉరిబిగిస్తే, అన్ని రహస్యాలూ వీళ్ళకు చెప్పి, యిక్కడికి వెంటబెట్టు కొచ్చాను. ప్రాణం తీపి అలాంటిది గురో!" అంటూ కింకరుడు, కోయగోమాంగ్ పక్క నుంచి కేక పెట్టాడు.

అదే సమయంలో కల్పకవల్లి కత్తితో బెబ్బులిలా ముందుకురికి, జగభోజి కంఠాన్ని ఒక్క వేటుతో నరుకుతూ, "పాపీ! నీకు యిదే తగిన శిక్ష," అన్నది.

జగభోజి చావు చూస్తూనే, బ్రహ్మదండి మాంత్రికుడు పెద్దగా మూలిగి, "వత్సా, కేశవా! శిష్యా, జయమల్లూ! నన్ను చంపకండి. నే నేమైనా పాపాలు చేసివుంటే— అదంతా మీ యిద్దరి మంచికే చేశాను. ఇక్కడున్న ధనరాసులన్నిటికీ వారసులు, మీరు," అంటూ బావురుమన్నాడు.

ఈ లోపల కేశవుడు, తన తండ్రి కేసి పరిగెత్తి, "అయ్యా, నిన్నీ జన్మలో మరి చూస్తాననుకో లేదు," అంటూ కావిలించుకున్నాడు. ముసలివాడు మాట్లాడేందుకు గొంతు పెగలక, కళ్ళవెంట ఆనందబాష్పాలు

రాల్చాడు. ఆ తండ్రి కొడుకుల ప్రేమ చూసి కల్పకవల్లి, ఎంతో ఆనందపడింది.

బిడాలీ, శ్వానకర్ణీ, కేశవుడి దగ్గిరకు వచ్చి, "కేశవా! నువ్వూ, నీ మిత్రులూ రెక్కల మనుషులను హత మార్చటానికి, మాకు చేసిన సహాయానికి కృతజ్ఞతగా, నీ తండ్రికీ, అతడి అనుచరులకూ, మా చేత నైనంత సహాయం చేశాం," అన్నారు. కేశవుడు ఆ అడవిమనుషుల నాయకు లిద్దర్నీ ఎంతో ప్రేమతో కౌగిలించుకున్నాడు.

బ్రహ్మదండి మాంత్రికుడూ, పులుగు రాయుడూ, బానిసల యజమాని స్థూల కాయుడూ బంధించబడ్డారు. కింకరుడు తమకు చేసిన సహాయానికి సంతోషించి, అతడి మెడకు బిగించిన ఉరితాడు తొలగించాడు కోయగోమాంగ్.

కల్పకవల్లి, అక్కడ చేరిన వారందరికీ పరిచయం చేయబడింది. ఆ తరవాత కొంత సేపటికి బిడాలీ, శ్వానకర్ణీ వాళ్ళ అనుచరులు తెచ్చిన వార్త విని, బ్రహ్మపుర రాజూ, రాజగురువూ అక్కడికి వచ్చారు.

కేశవుడు, రాజుకూ, రాజగురువుకూ, రావిచెట్టు మొదట్లో వున్న పాము పుట్ట చూపుతూ, "ఆ పుట్ట తవ్వితే, తమకు అంతులేని ధనరాసులు లభించగలవు.



అందులో నాకు పాలు యివ్వవలసిందని, అడగబోవటంలేదు, మహారాజా!" అన్నాడు.

రాజు, తన కుమార్తె కేసీ, కేశవుడి కేసీ ఓమారు చూసి, వాళ్ళు ఒకళ్ళ నొకళ్ళు ప్రేమగా చూసుకోవటం గ్రహించి, చిరు నవ్వు నవ్వుతూ, "కేశవా, నీ కేదో నా మీద విరోధ భావం వున్నట్టు కనబడుతున్నది. నిన్నూ, నీ తండ్రినీ, నీ స్నేహితులనూ దేశ ద్రోహులుగా ప్రకటించంటంలో, నేను పొర బాటు చేశానని గ్రహిస్తున్నాను. నా ఒక్కగా నొక్క కుమార్తె కల్పకవల్లి అపహరణ సంగతి తెలిసిన తరవాత, నేను రాజ్యంలో చేయించిన చాటింపు విషయం నీకు తెలియ

నట్టుంది. ఆమెను తిరిగి తెచ్చి నాకు ఒప్ప చెప్పిన వ్యక్తికి, ఆమె నిచ్చి వివాహం చేయటమే గాక, అర్ధ రాజ్య మిస్తానని కూడా ప్రకటించాను," అన్నాడు.

రాజగురువు, ఒక చేత్తో కేశవుడి భుజాన్నీ, మరొక చేత్తో జయమల్లు భుజాన్నీ పట్టుకుని, "మీరు పడిన కష్టాలకు మహారాజు కన్న, నేనే ఎక్కువ బాధ్యుణ్ణి. బ్రహ్మదండి వెంట యిద్దరు సైనికుల్ని పంపటం ద్వారా, అతడు రాజభక్తుడనీ, మీరు రాజద్రోహులనీ—అనవసరమైన అపవాదు కలిగించాను. ఏది ఏమైనా మీరు మీ శక్తిసామర్థ్యాల వల్ల అన్ని కష్టాలనూ ఎదుర్కొని జయించటమే గాక, రాకాసిలోయలోని ధనరాసుల్ని బ్రహ్మపురరాజ్య పరం చేశారు. ఆ ధనం వల్ల రాజ్యంలోని ప్రజలంతా సుఖపడతారు," అన్నాడు.

ఆ తరవాత సైనికులు రావిచెట్టు మొదట్లో వున్న పుట్ట అయిదారడుగులు తవ్వే సరికి, వాళ్ళకు పెద్ద భూగృహం ఒకటి కనిపించింది. అందులో వున్న వెలలేని రత్న మణిమాణిక్యాలూ, బంగారం, వెండీ చూసి అందరూ దిగ్భ్రాంతులయారు. ఆ ధనమంతా సైన్యం వెంట వచ్చిన ఏనుగుల మీదా, బళ్ళ మీదా ఎక్కించబడింది.

తరవాత అందరూ బ్రహ్మపురం చేరారు. రాకుమారి కల్పకవల్లితో, కేశవుడి వివాహం మహా వైభవంగా జరిగింది.

ముసలివాడు ఏ చీకూ చింతా లేకుండా తన కొడుకు కేశవుడి వద్ద వుంటూ, శేషజీవితాన్ని హాయిగా గడిపాడు. కొంత కాలానికి రాజు వృద్ధాప్యంలో మరణించగా, కేశవుడు బ్రహ్మపుర రాజ్యానికి రాజై, జయమల్లు మంత్రిగా, కోయగోమాంగ్, చిన్నగడేజంగ్‌లు సేనానాయకులుగా తనకు అన్నిటా సహాయపడుతూండగా, చాలా కాలం సుఖంగా రాజ్యపాలన చేశాడు.

—(అయిపోయింది)






# దొంగలను కొలిచిన ముని

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, అన్ని వ్రతాలలోకీ అత్యంత కష్ట సాధ్యమైనది మౌనవ్రతం. దానికి అనేక విఘ్నాలు కలుగుతాయి. అదీగాక, మౌనం వహించినంత మాత్రం చేత ఈతిబాధలు తొలగవు. పూర్వం శమీకుడనే ఋషి మౌనం వహించటం చేతనే కదా పరీక్షిత్తు ఆయన మెడలో చచ్చిన పామును వెయ్యటమూ, శమీకుడి కొడుకైన శృంగి పరీక్షిత్తును పాము కరిచి చచ్చిపొమ్మని శపించటమూ మొదలైనదంతా జరిగింది? అలాగే సర్వసంగపరిత్యాగం చేసి కూడా తన మౌనంతో అనేక చిక్కులు తెచ్చుకున్న మరొక మునిని గురించి చెబుతాను విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

## బేతాళ కథలు



పూర్వం ఒక ముని ఒక అరణ్యంలో తపస్సు చేసుకొనటానికి వచ్చాడు. ఆయన సర్వ సంగపరిత్యాగం చేసి, లోకంతో ఎలాటి సంబంధాలూ లేకుండా, నిర్జన ప్రాంతంలో ఒంటరిగా ఉండి, మౌనవ్రతం పట్టి, జలాహారమూ, ఫలాహారమూ చేస్తూ ఎక్కువ సేపు తపస్సమాధిలోనే ఉంటూ ఉండేవాడు. తాను తపస్సు చేసుకునే చోట జనసంచారం సాగినప్పుడాయన ఆ స్థలాన్ని విడిచి పెట్టి, మరొక నిర్జన ప్రాంతాన్ని చూసుకుంటూ ఉండేవాడు.

ఇలా ఆయన చోట్లు మారుతూ మరాళ దేశంలోని కొండల మధ్య ఉండే ఒక అరణ్యంలో తపస్సు చేసుకోవటానికి వచ్చాడు. అది దుర్గమమైన ప్రదేశం. చుట్టుపక్కల అనేక మైళ్ళ దూరంలో ఎక్కడా జన నివాస మన్నది లేదు. కొండల మధ్యగా చిన్న ఏరొకటి పారుతూ ఉన్నది. కొండల చుట్టూ దట్టమైన కీకారణ్యం ఉన్నది. ఆ ప్రదేశం అన్ని విధాలా తన తపస్సుకు తగినదనీ, అక్కడ తనకు తపోభంగం ఎంతమాత్రమూ కలగదనీ ముని అనుకుని, అక్కడ చేరాడు.

కాని అది నిజంగా జనసంచారం లేని స్థలం కాదు. మరాళదేశానికి చెందిన గజదొంగల ముఠా ఒకటి అప్పుడప్పుడూ అక్కడికి వచ్చి, తాము కొల్లగొట్టిన సొత్తును అక్కడి కొండలలో వున్న ఒక రహస్య గుహలో దాచుకుంటూ ఉండేది.

రాజభటులు దొంగలలో ఎవరినిగాని తరిమినప్పుడు వాళ్ళు ఈ ప్రాంతానికి వచ్చి, కీకారణ్యంలో దాక్కుంటూ ఉండేవారు.

ముని ఆ ప్రాంతానికి వచ్చిన కొద్ది రోజులకే తెల్లవారుజామున దొంగల నాయకుడు తన అనుచరులతో సహా, దొంగిలించిన సొత్తు తీసుకుని అక్కడికి వచ్చాడు. తపస్సమాధిలో ఉన్న ముని మొట్ట మొదటిసారిగా వారి కంటపడ్డాడు.

"వీడెవడో మనకు దాపరించాడేమిటి?" అని దొంగలనాయకుడు తన వెంట వున్న అనుచరులతో అన్నాడు.

"వీడు నిజమైన మునో, మన రహస్యాలు తెలుసుకునేటందుకు ముని వేషం వేసుకు యిక్కడికి వచ్చిన గూఢచారో?" అన్నాడు మరొక దొంగ.

"నిజమైన ముని అయినా, వీడిక్కడ ఉండటం మనకు ప్రమాదమే. వీడికి మన రహస్య స్థలాలన్నీ తెలిసిపోతాయి. రాజభటులు మనని తరుముకుంటూ ఈ కొండల లోకి వచ్చారంటే, వీణ్ణి బాధించి అయినా మన సంగతి చెప్పిస్తారు!" అన్నాడు మరొక దొంగ.

"అందుచేత వీణ్ణి కైలాసానికి పంపించటమే మనకు క్షేమం," అని మరొక దొంగ అన్నాడు. మిగిలిన దొంగలంతా ఇదే మంచిదన్నారు.

కాని దొంగల నాయకుడు తొందరపడక, మునిని సమీపించి, "స్వామీ, మీరు తపస్సు చేసుకో దలిస్తే మరెక్కడికైనా వెళ్ళండి. ఇది మేముండే ప్రదేశం. మేమీ కొండలకూ, అరణ్యానికీ రాజులం. మీకూ మాకూ పొత్తు కలవదు. అందుచేత వెంటనే ఇక్కడి నుంచి వెళ్ళి పొండి," అన్నాడు.



అప్పుడే తపస్సమాధి నుంచి మేలుకున్న ముని కళ్ళు తెరిచి చూచాడు గాని, దొంగల నాయకు డన్న దానికి సమాధానం చెప్ప లేదు. మునికి చెవుడేమోనని దొంగల నాయకుడు ఆ మాటే మరింత గట్టిగా అరిచి చెప్పాడు. అయినప్పటికీ ముని సమాధాన మివ్వలేదు.

"చూస్తావేమిటి? కత్తి తీసి తల నరికెయ్యక!" అన్నారు మిగతా దొంగలు.

దొంగల నాయకుడు కత్తి దూసి ముని తల నరకటానికి ఎత్తాడు. ముని తన చెయ్యి పైకెత్తి వాడి చేతిని పట్టుకున్నాడు. వెంటనే దొంగల నాయకుడు కెవ్వున అరిచి కత్తిని

జార విడిచాడు. వాడి చేతికి ముని చెయ్యి ఎర్రగా కాలిన ఇనుములాగా తగిలింది.

ముని మౌనం చాలించి, "నాయనా, నిన్ను ఘోరనరకం నుంచి తప్పించటానికి నీ ప్రయత్నాన్ని భంగపరిచాను. నాకు చావటాని కేమీ అభ్యంతరం లేదు గాని, నన్ను చంపిన పాపం నిన్ను జన్మ జన్మలకూ విడవదు. నాకు నీపై ఏమీ ఆగ్రహంలేదు. నీ దారిన నీవు వెళ్ళు," అన్నాడు.

దొంగల నాయకుడు ముని ముందు సాగిలపడి, "మీ మూలంగా మా రహస్యాలు బయట పడతాయేమోననే మాకు భయం. వాటిని భద్రంగా కాపాడుతానని మాట ఇవ్వండి, స్వామీ. మీ వల్ల మాకు అపాయం కలగనంత కాలమూ మీరు నిశ్చింతగా తపస్సు చేసుకోవచ్చు," అన్నాడు.

"నేను ఒకరి కెందు కపాయం చేస్తాను, నాయనా? ఎవరి పాపకర్మ వారినే కట్టి కుడుపుతుంది. మీరు మంచిగా ఉంటే మీ కెవరి నుంచీ ఎటువంటి హానీ జరగదు," అన్నాడు ముని.

అటు తరువాత దొంగలు ముని జోలికి వెళ్ళలేదు. కొద్దిరోజులు గడిచింది. దొంగలు తమ మానాన తాము దొంగతనాలు చేస్తూనే ఉన్నారు. ఒకనాటి తెల్లవారుజామున దొంగల నాయకుణ్ణి తరుముకుంటూ రాజు



గారి సైన్యానికి చెందిన సైనికులూ, దండ నాయకుడూ వచ్చారు. దొంగల నాయకుడు తమ రహస్యస్థానం చేరుకుని దాక్కున్నాడు.

రాజుగారి సైనికులూ, దండనాయకుడూ కొంచెం ఆలస్యంగా ముని ఉన్న చోటికి వచ్చి, అటూ ఇటూ చూశారు. తాము తరుముకు వచ్చిన మనిషి ఎటు వెళ్ళాడో వారికి అంతు చిక్కలేదు. ఎటు వెళ్ళటానికీ మార్గం ఉన్నట్టే వారికి కనబడలేదు.

దండనాయకుడు మునిని సమీపించి, "స్వామీ, ఇటుగా మనిషి ఒకడు పరిగెత్తు కుంటూ వచ్చాడు, మీరేమైనా చూశారా?" అని అడిగాడు.

ముని అప్పుడే తపస్సమాధి నుంచి మేలు కుని కళ్ళు తెరిచాడు, కాని దండనాయకుడి ప్రశ్నకు సమాధాన మివ్వలేదు. దండనాయ కుడు రెండు మూడు సార్లు అదే ప్రశ్న వేశాడు, కాని ముని సమాధాన మివ్వలేదు.

"నీవే పెద్ద దొంగలాగున్నావు. మేము తరుముకు వచ్చిన వాడు గజదొంగ. వాణ్ణి పట్టుకోవటానికి నీవు మాకు సహాయం చెయ్యకపోతే నీవు కూడా వాడితో సమంగా దండనార్హుడివే అవుతావు. అందుచేత నీ కా దొంగను గురించి తెలిసిన దంతా చెప్పక పోతే నిన్నిప్పుడే శిరశ్ఛేదం చేస్తాను," అంటూ దండనాయకుడు కత్తి ఎత్తాడు.



ముని అప్పటికీ సమాధానం చెప్పకపోగా, మెడ నరకమన్నట్టుగా తల వంచాడు.

ఆ సమయంలో పొదల చాటునుంచి దొంగల నాయకుడు బయటికి వచ్చి, "ఆయన తపస్సు చేసుకునే పుణ్యాత్ముడు. ఆయన నేమీ చెయ్యకండి. నేనే దొంగను, నన్ను పట్టుకుపొండి!" అని దండనాయకుడితో అన్నాడు.

దండనాయకుడు అతని చేతులకు సంకెళ్ళు తగిలించి పట్టుకుపోయాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నాకొక్క సందేహం. దొంగల నాయకుడు తనను చంప వచ్చినప్పుడు చెయ్యిపెట్టి నిరోధించిన ముని దండనాయకుడు చంప వచ్చినప్పుడెందుకు తల వంచాడు? తనను చంపిన పాపం దొంగల నాయకుడికి చుట్టుకుంటుందేమో నన్న విచారం వెలిబుచ్చిన మునికి, అలాటి పాపమే దండనాయకుడికి చుట్టుకుంటుందన్న విచారం ఎందుకు లేక పోయింది? సర్వసంగ పరిత్యాగం చేసి తపస్సు చేసుకునే మునికి, రాజోద్యోగి మీద కన్న దొంగల నాయకుడి పైన హెచ్చు అభిమానం దేనికి? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో, నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "మునికి పక్షపాతం ఏమీ లేదు. దొంగల నాయకుడు ఆయనను చంపి ఉంటే ఆ పాపం వాడికి చుట్టుకునేది. కాని దండనాయకుడు మునిని చంపితే అతని కేమీ పాపం ఉండదు. అతని దృష్టిలో రాజశాసనాన్నిబట్టి ముని దండ్యుడే. ఎందుకంటే ముని దండనాయకుడికి దొంగ ఆచూకీ తెలిసి కూడా చెప్పలేదు. కనుకనే ముని దండనాయకుడి చేతిలో చావటానికి సిద్ధపడ్డాడు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# గజ ఈతగాడు

చాలా ఏళ్ళ క్రితం పశ్చిమ సముద్రతీరాన కేరళ రాజ్యానికి చెందిన ఒక దీవి లక్క దీవులకు కొంచెం దూరంలో ఉండేది. అది చాలా వరకు రాతిమయంగా ఉండటం చేత అక్కడ వ్యవసాయానికీ, ఇతర వృత్తులకూ అవకాశం ఉండేది కాదు. కనుక ఆ దీవిలో నివసించే వారు ప్రధానంగా చేపలు పట్టి జీవించే వారూ, పశువులను పోషించే వారూ అయి ఉండే వారు. అక్కడి బెస్తలలో కొందరు నావికులుగా వెళ్ళిపోయే వారు. మరికొందరు సముద్రం అడుగుకు వెళ్ళి ముత్యపు చిప్పలూ, పగడపు రాళ్ళూ తెచ్చి వాటిని దీవి లోని వర్తకుల కమ్మి పొట్ట పోసుకునే వారు.

ఆ దీవిలో ఉండే ఒక ముసలి బెస్త వాడికి చాలా మంది కొడుకులు. వారిలో చాలా మంది చేపలు పట్టటంలో తండ్రికి సహాయం చేసి, తాము కూడా అదే వృత్తి అవలంబించారు. ఒకరిద్దరు వర్తక నౌక లలో పనులు సంపాదించుకున్నారు. వారిలో ఆఖరివాడు చిన్నతనం నుంచీ ఒక విచిత్ర మైన ప్రకృతి కలవాడు. చేపలు తన్నుకుని చావటం వాడు చూడలేకపోయే వాడు. చిన్నతనంలో వాడు తీరానికి వెళ్ళి, తన తండ్రీ, అన్నలూ పట్టుకొచ్చిన చేపలను తట్టలలో మోసుకుపోయేటప్పుడు, ఏ చేపలో నైనా ప్రాణం ఉన్నట్టు కనిపిస్తే దాన్ని వెంటనే నీటిలోకి విసిరివేసే వాడు. ఒక్కొక్కసారి వాడు ఇంటికి చేరే సరికి తట్టలో సగం చేపలు కూడా ఉండేవి కావు.

ఈ విధంగా వాడు భూతదయ గలిగి ఉండటం చేత వాడికి చేపలు పట్టే వృత్తి అబ్బ లేదు. కాని వాడికి సముద్రమన్నా, చేపలన్నా అంతులేని ప్రేమ. "ఎందుకూ పనికిరాని మొద్దు!" అని తల్లిదండ్రుల చేత తిట్లు తిని, వాడు సముద్రతీరానికి వెళ్ళి

ఇ. విశ్వేశ్వరరావు



గంటల తరబడి కూర్చునే వాడు. సము ద్రంలో ఈతలు కొట్టే వాడు. భూమి మీద కన్న వాడికి సముద్రం అడుగున ఎక్కువ వింతలూ, రంగులూ, ఆకర్షవంతమైన దృశ్యాలూ కనిపించేవి. అందుచేత వాడు నీటి అడుగున చాలాసేపు ఉండటం అభ్యాసం చేసి, అట్టడుగు సముద్రంలో సంచరించటమూ, అక్కడ ఉండే వింత వింత చేపలనూ, పగడపు "చెట్ల"నూ, విచిత్రమైన కాంతులనూ చూసి ఆనందించ టమూ సాగించాడు.

పెరిగి పెద్దవాడయే సరికి వాడు వెళ్ళి నంత సముద్రపు లోతులకు వెళ్ళి, నీటి అడుగున వాడున్నంతసేపు ఉండగల వాడు ఆ దీవిలో ఒక్కడు కూడా లేడు. వాడికి "చేపమనిషి" అని అందరూ పేరు పెట్టారు. వాడు ఉదయమే వెళ్ళి పగలంతా సము ద్రంలో గడిపి, చీకటి పడ్డాక ఇంటికి తిరిగి వచ్చి, తాను ఆ రోజు చూసిన వింత లన్ని టినీ తన అన్నలకు వర్ణించి చెప్పే వాడు. సముద్రం అడుగున మునిగిపోయిన పడవ లుండేవి. వాటి పగుళ్ళలో నీటి మొక్కలు పెరిగేవి. పగడపు శిలల మీద శాఖలు శాఖలుగా ఎర్ర, తెల్ల పగడపు "కొమ్మ" లుండేవి. నీటిలో ముత్యపు చిప్పలూ, నక్షత్ర చేపలూ, కనీ వినీ ఎరగని గాజులాటి చేపలూ, ఎన్నో ఉండేవి.

వాటన్నిటినీ వాడు వర్ణిస్తూంటే అన్నలు వినిపించుకోక, వాడికి నిశ్చయంగా పిచ్చే ననుకునే వారు. వాడికి గాలి సోకిందేమో నని వాడి తల్లి తాయెత్తులు కట్టించింది. కాని తాయెత్తులతో వాడి ధోరణి మారలేదు. పైగా వాడికి గొప్ప ఖ్యాతి వచ్చింది. "చేప మనిషి" అనే మాట దీవిలోని అందరి నోటా వినపడి, చివరకు ఆ దేశపు రాజు దాకా వెళ్ళింది.

అందుచేత రాజుగారు వాణ్ణి ఒకసారి తన భవనానికి పిలిపించాడు.

వాడు రాజుగారి దర్శనానికి వెళ్ళినప్పుడు రాజుగారి కూతురు, పదిహేడేళ్ళ పిల్ల కూడా అక్కడే ఉన్నది.

"ఏమిరా, నువ్వు ఎంత లోతు సముద్రం అడుగుకైనా దిగ గలవట, సముద్రాన్ని గాలించటంలో నీకు ఈడయిన వాడు ప్రపంచంలో లేడట? ఆ మాట నిజమేనా?" అని రాజు అడిగాడు.

"ఇతరుల మాట నాకు తెలియదు, మహారాజా!" అన్నాడు వాడు.

"నీ శక్తి చూస్తాం!" అంటూ రాజుగారు అప్పటి కప్పుడే తన విహార నౌకలో తన కుమార్తెతో పాటు వాణ్ణి కూడా ఎక్కించుకుని, సముద్ర మధ్యానికి నౌకను నడిపించి, ఒక బంగారు పాత్రను సముద్రంలో గిరవాటు వేసి, "దాన్ని తీసుకురా!" అన్నాడు.

వాడు సముద్రంలో మునిగి, అడుగుకు చేరి, బంగారు పాత్రను తీసుకుంటూ, అక్కడే ఉన్న పగడపు "కొమ్మ" ఒకటి విరిచి పైకి వచ్చాడు. వాడా పగడపు "కొమ్మ"ను రాజకుమార్తె కిచ్చి, బంగారు పాత్రను రాజుగారి కివ్వబోయాడు.

"అది నీవే ఉంచుకో. ఇంత కన్న కష్టమైన పని చెబుతాను, చేస్తావా?" అన్నాడు రాజుగారు.





"చెప్పండి, చాతనైతే చేస్తాను," అన్నాడు వాడు.

"నీ ఈ దీవి చుట్టూ ఉన్న సముద్రం దిగువ భాగమంతా తిరిగి, అక్కడి విశేషాలు నాకు చెప్పాలి," అన్నాడు రాజు.

"చాలా దూరం," అన్నాడు వాడు.

"నాకు తెలుసు. నీకు కావలిసినంత వ్యవధి తీసుకో. అవసరమైనప్పుడు విశ్రాంతి కూడా తీసుకో. కాని దీవిని చుట్టి, అక్కడి విశేషాలు తెలుసుకోకుండా మాత్రం నా దగ్గిరికి తిరిగి రాకు," అన్నాడు రాజు.

"అయితే ఇక్కడే ఉండండి," అని వాడు రాజకుమార్తె కేసి చూసి సముద్రంలో మునిగాడు. వాడు తిరిగి రావటానికి మూడు మాసాలు పట్టింది.

"మహారాజా, మా దీవికి అడుగున మూడు బ్రహ్మాండమైన రాతి కొండలు ఆధారం ఉన్నాయి. వాటి తాలూకు రాయి మామూలు కొండరాయి కన్న చాలా బలమైనది. అయితే వాటిలో ఒకటి నశించి పోతున్నది," అన్నాడు వాడు రాజుగారితో.

"నశించి పోతున్నదా? ఎందుకూ?" అని రాజు అడిగాడు.

"దాని దిగువ భాగంలో అగ్ని ప్రజ్వరిల్లుతున్నది. అది రాతిని ధ్వంసం చేస్తున్నది. ఆ అగ్ని ఉన్న ప్రాంతంలో చాలా మేర ఒక్క నాచు మొక్కగాని, ఒక్క చిన్న చేపగాని లేదు," అన్నాడు వాడు.

"నీటి అడుగున అగ్ని ఏమిటి?" అన్నాడు రాజు.

"మహారాజా, అది మామూలు అగ్ని కాదు. అది బడబాగ్ని. నీరు దాన్ని చల్లార్చ లేదు," అన్నాడు వాడు.

"బడబాగ్ని అనే మాట విన్నాను గాని ఎన్నడూ చూడలేదు. కొంచెం అగ్ని తెచ్చి చూపించు," అన్నాడు రాజు.

"అగ్నిని తీసుకు రావటం ఎలా మహారాజా?" అన్నాడు వాడు.

"నేనేం చెప్పగలను! అది నీకే తెలియాలి," అన్నాడు రాజు.

వాడు మళ్ళీ సముద్రం అడుగుకు వెళ్ళాడు. అగ్నిని సమీపించటానికి వాడు విశ్వ ప్రయత్నాలు చేశాడు. చేతులూ, కాళ్ళూ, వళ్ళూ కాలాయి. వాడు కాలిన శరీరంతో విహారనౌక వద్దకు తిరిగి వచ్చి, "అగ్నిని తీసుకురావటం నాకు సాధ్యం కాలేదు, మహారాజా. ఇదుగో, దాని సాక్ష్యం!" అంటూ తన చేతులూ, కాళ్ళూ ఆయనకు చూపాడు.

"ఇప్పుడు నీ మాట నమ్మగలను. నీవు నిజంగా అపూర్వమైన ఈతగాడివే," అన్నాడు రాజు.

"ఈసారి అగ్నిని చాలా దగ్గరగా చూశాను, మహారాజా. అది ఒక కొండను చాలా భాగం తినేసింది. దీవికి త్వరలోనే గొప్ప ప్రమాదం రానున్నదని నానమ్మకం," అన్నాడు వాడు.

రాజుగారు వాడి మాట మీద నమ్మకం ఉంచి, ఆ దీవిలో ఉండే వారందరినీ దీవి వదిలి రావలిసిందని ఉత్తరువు చేశాడు. వారికి నివాసయోగ్యప్రదేశాలు ఏర్పాటు చేశాడు. దీవిని మనుషులూ, పశువులూ విడిచిపెట్టిపోయిన కొద్ది రోజులకే ఆ దీవి మీద భయంకరమైన భూకంపాలు కలిగి, ఒక మాసం రోజుల లోపల దానిలో ఒక్కొక్క భాగమే సముద్రజలం లోకి ఒరిగిపోయింది.

రాజు "చేప మనిషి"ని పిలిపించి, "నీ ప్రజ్ఞ వల్ల అనేక వేల మంది ప్రాణాలు దక్కాయి. ఏమి బహుమతి కోరుకుంటావో కోరుకో," అన్నాడు.

వాడు రాజకుమార్తె కేసి చూసి, జవాబు చెప్పలేదు. తన కూతురి అభిప్రాయం అది వరకే తెలుసుకుని ఉన్న రాజు వాడికి ఆమె నిచ్చి పెళ్ళి చేసి, తన వద్దనే ఉంచుకున్నాడు.





# చురుకైన పిల్ల

ఒకప్పుడు వజ్రదత్తు డనే రాజు తన ప్రజల యోగక్షేమాలు కనుక్కొని ప్రజారంజకంగా పరిపాలించటానికి గాను తరుచు మారు వేషంలో తిరుగుతూ ఉండే వాడు. ఆయన వెంట సాధారణంగా సూక్ష్మబుద్ధి అనే మంత్రి కూడా ఉంటూ ఉండే వాడు.

ఒకనాడు రాజూ, మంత్రీ వర్తకుల దుస్తులు ధరించి నగరు దాటి గ్రామాల వెంట తిరుగుతూండగా, ఒక గ్రామంలో ఒక గుడిసెలో నుంచి విచారకరమైన మాటలు వినిపించాయి. రాజు ఆగి ఆ మాటలు విన్నాడు.

"ఏం చెయ్యాలో నాకు తోచటం లేదు. నా వల్ల ఏమీ కాదు. మీ అమ్మను ఆ ఈశ్వరుడే బతికించాలి!" అని గుడిసెలో ఎవరో అంటున్నారు.

ఈ మాటలు విని జాలిపడి రాజు మంత్రితో సహా గుడిసె వాకిలి వద్దకు వెళ్ళి లోపలికి తొంగి చూశాడు. లోపల ఒక పేద రైతు అరుగు పైన, నెత్తిన చేతులు పెట్టు కుని విచారంగా కూర్చుని ఉన్నాడు. గుంజ నానుకుని నిలబడి అతని కూతురు ఏడుస్తున్నది. పక్కన చాప మీద రైతు భార్య మూలుగుతూ పడుకుని ఉన్నది.

ఎవరో కొత్త వాళ్ళు గడపలో కనబడటం చూసి రైతు అరుగు మీది నుంచి దిగి నిలబడ్డాడు.

"నీకు వచ్చిన కష్ట మేమిటి? సాధ్యమైతే సహాయం చేస్తాను," అన్నాడు మారు వేషంలో ఉన్న రాజు.

"అయ్యా, నేను కటికపేదను. నా భార్య జబ్బుతో ఉన్నది. వైద్యం చేయించాలంటే ఇరవై రూకలు కావాలి. ఎవరైనా ధర్మాత్ములు బదులిస్తే ఒక నెల లోపల తీర్చుకుంటాను. కాని ఇచ్చే వారు లేరు. ఎందరినో అడిగి చూశాను. తెగ నమ్మటానికీ,

బి. వెంకటపతి

తాకట్టు పెట్టటానికీ నా దగ్గిర ఏమీ లేదు,'' అన్నాడు రైతు.

"నీకు కావలిసిన ఇరవై రూకలూ నే నిస్తాను. కాని నెల లోపుగా ఎలా తీరుస్తావు?'' అని రాజు అడిగాడు.

"కూలి చేసి సంపాదించే దానిలో, ఏదోవిధంగా కొంత మిగిల్చి ఇస్తాను,'' అన్నాడు రైతు.

"సరే, ఇరవై రూకలూ తీసుకో,'' అంటూ రాజు మంత్రికి సైగ చేశాడు. మంత్రి తన వద్ద ఉన్న సంచీలో నుంచి ఇరవై రూకలూ ఎంచి ఇచ్చాడు.



రైతు ఆశ్చర్యంతోనూ, కృతజ్ఞతతోనూ వాటిని తీసుకుంటూ, "తమ రెవరో, ఎక్కడుంటారో ? ఈ యిచ్చిన దానికి వడ్డీ ఎంత కోరుతారో ?'' అన్నాడు.

"వడ్డీ అవసరం లేదు. కాని సరిగా నెల రోజులకు బాకీ తీర్చాలి. ఇవాళ శుక్ల చతుర్థి. పై శుక్లచతుర్థి నాడు సాయంకాలం సూర్యాస్తమయ వేళ నగరంలో వినాయకుడి గుడి వద్దకు డబ్బు తీసుకు రా. మే మక్కడే ఉంటాం,'' అని చెప్పి రాజు మంత్రితో సహా ముందుకు సాగి వెళ్ళాడు.

భగవంతుడే ఈ మనుషుల రూపంలో వచ్చి తనను ఆదుకున్నా డనుకుని రైతు తన భార్యకు శ్రద్ధగా చికిత్స చేయించాడు. చికిత్స ఫలించి ఆమె కోలుకుని త్వరలోనే మామూలు మనిషి అయింది.

కాని నెల గడువు తీరే సరికి రైతు ఇరవై రూకలూ పోగు చెయ్యలేక పోయాడు. కొంచెం కొరత అయింది. తక్కువ డబ్బుతో వారి వద్దకు వెళ్ళటానికి సిగ్గేసి అతను వినాయకుడి గుడి వద్దకు వెళ్ళక, మిగతా డబ్బు కూడా చేరిన తరువాతనే వారి ఎదట పడి, డబ్బిచ్చి క్షమాపణ చెప్పుకుందాం గదా అనుకున్నాడు.

గడువు తీరిన మర్నాడు, శుక్ల పంచమి నాడు, సాయంకాలం వేళ రాజూ మంత్రీ

పూర్వంలాగే మారువేషాలు వేసుకుని రైతు గుడిసె ముందుకు వచ్చి, "ఎవరు లోపల?" అని కేక వేశారు.

"నేనేనండీ!" అంటూ రైతు కూతురు లోపలి నుంచి వచ్చి వాళ్ళను చూసి, "కన పడనిది లోపల బాగానే ఉంది. అంతటా వెలుగే. చీకటి ఏమీ లేదు," అన్నది.

రాజు కామె మాట లేమీ అర్థం కాక మంత్రి కేసి చూశాడు. మంత్రి ముఖాన చిరునవ్వు చూస్తే ఆయన కాపిల్ల మాట లర్థమైనట్టు కనబడింది.

"మీ నాన్న ఎక్కడ?" అని మంత్రి ఆ పిల్ల నడిగాడు.

"పైకెక్కి సూర్యదేవుడి కన్ను కప్ప బోయాడు," అన్న దామె.

"మీ అమ్మ ఏమయింది?" అని అడి గాడు మంత్రి.

"బావి స్తంభం నీటి నుంచి డబ్బు లేరుకు రాబోయింది," అన్న దామె.

"అయితే నువ్వేం చేస్తున్నావు?" అని మంత్రి మళ్ళీ అడిగాడు.

"బంగారం నుండి వెండి తీసి అగ్గిలో పెట్టాను. అన్నీ మోసే మొద్దుకు ముద్దవేసి మెరుగు పెడుతున్నా," అన్న దామె.

"మేం వస్తామని మీ నాన్నకు తెలి యదా?" అన్నాడు మంత్రి.






# పాత చెప్పులు

ఒక గ్రామంలో సుబ్బయ్య అనే కాపు ఒక డుండేవాడు. అతను తన కున్న కొద్ది పొలాన్ని తానే స్వయంగా చేసుకుని, అందులో కాయలూ కూరలూ పెంచి, వారాని కొకసారి బస్తీకి తీసుకుపోయి అమ్మి, బస్తీ నుంచి ఇంటికి కావలిసిన సరుకులు తెచ్చుకుని కాలక్షేపం చేస్తున్నాడు.

బస్తీకి వెళ్ళినప్పుడల్లా సుబ్బయ్య అక్కడి దేవాలయానికి వెళ్ళి, తప్పక దేవుడి దర్శనం చేసుకుని మరీ ఇంటికి బయలు దేరే వాడు.

ఒకసారి సుబ్బయ్య బస్తీకి బయలుదేరే టప్పుడు ఉత్తకాళ్ళతో బయలుదేరాడు. కారణమేమంటే అతని పాత చెప్పులు బొత్తిగా పనికి రాకుండా అరిగి బొక్కలుపడి పోయాయి. అందుచేత అతను ఈసారి కూరలమ్మిన డబ్బులో నుంచి బస్తీలో కొత్త చెప్పులు కొనుక్కున్నాడు. వాటితోనే అతను దేవాలయానికి వచ్చి, చెప్పులు బయట విడిచి, దేవుణ్ణి దర్శించుకోవటానికి గుడి లోపల ప్రవేశించాడు.

ఆ ఆలయం సమీపంలోనే కోటయ్య అనే చిల్లర అంగడి వ్యాపారస్తు డుంటు న్నాడు. అతను కూడా ఆలయానికి వచ్చి, దేవుడికి దణ్ణం పెట్టుకుని, సుబ్బయ్య లోప లికి పోతూండగా తాను బయటికి వచ్చాడు. ఆలయం వెలపలికి రాగానే కోటయ్యకు సరి కొత్త చెప్పుల జత కనబడింది. లోభ స్వభావుడైన కోటయ్యకు వీలుంటే వాటిని సంగ్రహించాలని పుట్టింది. వాటిని కాళ్ళకు తొడుక్కున్నాడు. ఆ చెప్పులు అతని కోసమే కుట్టినట్టుగా సరిపోయాయి. కొద్ది క్షణాల పాటు కోటయ్య అటూ ఇటూ తిరిగాడు. ఎవరూ అతన్ని అడ్డగించ లేదు. ఆ చెప్పుల తాలూకు మనిషి ఎవడూ ఆ దాపులలేడని నిర్ధారణ చేసుకుని, కోటయ్య చెప్పుల కోసం

సి. జగన్నాధరావు



ఇంటికి వెళ్ళే పని కూడా లేదు గనక, కొత్త చెప్పులతో తిన్నగా దుకాణానికే వెళ్ళాడు.

కోటయ్య బయలుదేరిన కొద్ది క్షణాలకే సుబ్బయ్య ఆలయంలో నుంచి వచ్చి, తన కొత్త చెప్పులు లేకపోవటం గమనించాడు. ఎవరైనా పొరపాటున వేసుకుని పోయి ఉంటా రనుకోవటానికైనా మరొక జత చెప్పు లక్కడ లేవు. తన చెప్పు లెవరో దొంగతనం చేశారు. దేవుడి సన్నిధినే దొంగతనం జరిగిపోయింది! దేవుడి దర్శనం కోసం వచ్చినవాడే దొంగతనానికి పాల్పడ్డాడు.

ఎంతో సాహసించి, కష్టార్జితం వెచ్చించి కొన్న కొత్త చెప్పులు పోయేసరికి సుబ్బయ్య ప్రాణం చివుక్కుమన్నది. ఆ చెప్పుల జాడ కనుక్కోకుండా గ్రామానికి తిరిగి వెళ్ళటానికి అతనికి బుద్ధి పుట్టలేదు. అతను వేగంగా నడుచుకుంటూ అంగళ్ళ బజారు కేసి బయలుదేరాడు. కొద్ది సేపట్లోనే సుబ్బయ్యకు ముందు నడిచిపోతున్న కోటయ్య కనిపించాడు. కోటయ్య కాళ్ళకున్నవి కొత్త చెప్పులే! మనిషి కూడా తనకు గుడిలో ఎదురైన మనిషిలాగే ఉన్నట్టు సుబ్బయ్యకు తోచింది. అందుచేత అతను కోటయ్య వెనకడితే, అతని దుకాణం దాకా వెళ్ళాడు.

కోటయ్య దుకాణం ముందు చెప్పులు వదిలి లోపలికి వెళ్ళాడు. అప్పుడు సుబ్బయ్య ఆ చెప్పులను జాగ్రత్తగా పరీక్షించి అవి తన కొత్త చెప్పులేనని రూఢి చేసుకున్నాడు. ఎందుకంటే కొనక ముందే సుబ్బయ్య ఆ చెప్పులను ఎంతో సేపు పరిశీలించి ఉన్నాడు.

ఈ లోపల కోటయ్య సుబ్బయ్యను గమనించి, "ఏం కావాలి? మంచి చింతపండు వచ్చింది, తీసుకుంటావా?" అని అడిగాడు. తాను కాజేసిన కొత్త చెప్పు లామనిషి వేసని కోటయ్యకు తెలియదు.

"నా కేమీ అక్కర్లేదండీ. నా చెప్పుల కోసం వచ్చాను," అన్నాడు సుబ్బయ్య.

కోటయ్య గుండె గుబుక్కుమన్నది. కాని మరుక్షణమే అతను ఈ పల్లెటూరి పేద రైతును బుకాయించ నిశ్చయించుకున్నాడు. ఎందుకంటే, చెప్పులు దొంగిలించిన లాభం కంటె, ఈ చిన్నకారు మనిషి చేత దొంగ అనిపించుకోవటం వల్ల కలిగే పరువు నష్టం చాలా హెచ్చు. అందుచేత కోటయ్య గుడ్లు రిమి, "ఏమన్నావురా?" అన్నాడు.

సుబ్బయ్య ఏమీ బెదరలేదు. అతను మర్యాదగానే, "మీరు గుడి నుంచి వస్తూ ఏమరుపాటున వాటిని తొడుక్కొచ్చి ఉంటారు. నా చెప్పులు నేను తీసుకుపోతా," అంటూ చెప్పుల్లో కాళ్ళు పెట్టబోయాడు.

"నీ చెప్పులు నేను కాజేశానంటావా? నాకు దొంగతనం అంట గడతావుట్రా? మంచి ఎత్తేవేశావే!" అన్నాడు కోటయ్య పెద్దగా గొంతెత్తి.

"మీకు దొంగతనం అంట గట్టానా? చెప్పులు నావన్నాను," అన్నాడు సుబ్బయ్య.

ఆ చెప్పులు తనవని సుబ్బయ్య రుజువు చేసుకోగలడని కోటయ్యకు తోచలేదు. అదీ గాక, తాను ఆ చెప్పులు సుబ్బయ్య వయి ఉంటాయని ఒప్పుకుంటే, పది మందీ తిరుగుతున్న చోట తాను దొంగతనం చేసినట్టు ఒప్పుకున్నట్టే అవుతుంది. వీధిన




వెళ్ళే వాళ్ళు కొందరు ఆగి, జరిగేదంతా వింటున్నారు కూడా.

"పోరా దొంగ వెధవా!" అని కోటయ్య సుబ్బయ్యను దుకాణంలో నుంచి బయటికి గెంటబోయాడు.

సుబ్బయ్య, "నా చెప్పులు! నా కొత్త చెప్పులు!" అని కేకలు పెట్టాడు. మరింత మంది చేరారు. ఆ చెప్పులు ఎక్కడ కొన్నావని కొందరు సుబ్బయ్య నడిగారు. వీధిన వెళ్ళే మాదిగవాడి దగ్గిర కొన్నానని సుబ్బయ్య చెప్పాడు.

"చూడవోయ్, ఆ చెప్పులు నీవని నువు రుజువు చేసుకోలేవు. అవతల పెద్దమనిషి



తన వంటున్నాడాయె. అందుచేత ఇది మధ్యవర్తులు పరిష్కరించే విషయం కాదు. న్యాయాధికారి వద్దకు వెళ్ళి ఫిర్యాదు చెయ్యి. ఆ తరువాత ఏమైతే అది అవుతుంది," అని నలుగురూ చేరి సుబ్బయ్యకు సలహా ఇచ్చారు.

సుబ్బయ్య ఆ సలహా ననుసరించి న్యాయాధికారి వద్దకు వెళ్ళి, తన కొత్త చెప్పులను ఫలానా కోటయ్య అనే దుకాణదారు కాజేసినట్టు ఫిర్యాదు చేశాడు. న్యాయాధికారి కోటయ్యను చెప్పులతో సహా పిలిపించాడు. చెప్పులు ఇద్దరి కాళ్ళకూ సమంగా సరిపోయాయి. ఇద్దరికీ సాక్షులు లేరు. "వెధవ చెప్పులు కొనటానికి కూడా సాక్షులను పక్క నుంచుకోవాలంటే నాలాటి వ్యాపారస్తుడు బతకగలడా?" అని కోటయ్య ఎద్దేవా చేశాడు.

ఇద్దరిలోనూ ఒకరు దొంగ అన్నది న్యాయాధికారికి రూఢి అయింది. "మీ రిద్దరూ మీ అరిగిపోయిన పాత చెప్పులు తెస్తే ఈ చెప్పు లెవరివైనదీ నేను తీర్పు చెబుతాను," అన్నా డాయన.

"నేను అరిగిపోయిన చెప్పు లుంచుకుంటానుటండీ? వాటిని అప్పుడే ఇలాటి పేదవాడికి దానం చేసేశాను," అంటూ కోటయ్య సుబ్బయ్యను చూపాడు.

సుబ్బయ్య మటుకు, "నా పాత చెప్పులు రేపు తెచ్చి తమకు చూపిస్తాను. నాకు తమరు న్యాయం చెయ్యాలి. పేదవాణ్ణి!" అన్నాడు దీనంగా.

"అలాగే చెయ్యి. నీ పాత చెప్పులే చాలు నిజం తెలుసుకోవటానికి," అన్నాడు న్యాయాధికారి. దొంగతనం చేసినది కోటయ్యే నన్న అనుమానం న్యాయాధికారికి అప్పుడే కలిగింది.

కోటయ్య పాత చెప్పులు ఏమంత పాతవి కావు. వాటిని ఇంకా చాలాకాలం వాడవచ్చు. వాటిని న్యాయాధికారి చూస్తే,

" ఈ చెప్పు లింకా గట్టిగా ఉండగానే కొత్తవి కొన్నావే ? '' మని అడుగుతాడు.

అందుచేత కోటయ్య తన పాత చెప్పులను ఎవరికో ఇచ్చినట్టు బొంకాడు. తన దాతృత్వాన్నీ, సుబ్బయ్య పేదతనాన్నీ న్యాయాధికారికి ఎత్తి చూపటానికి కూడా అతను ప్రయత్నించాడు.

కోటయ్యా, సుబ్బయ్యా వెళ్ళిపోగానే న్యాయాధికారి కొత్వాలును పిలిపించి, " ఫలాని కోటయ్య అనే వ్యాపారస్తుడి వెంట రహస్యంగా ఒక మనిషిని ఉంచండి. అతను ఈ రాత్రికి ఫలాని గ్రామం వెళ్ళి అక్కడ ఒక చిన్న దొంగతనం చేసే అవకాశం ఉన్నది,'' అని చెప్పాడు.

న్యాయాధికారి ఊహించినట్టుగా కోటయ్య సుబ్బయ్య పాత చెప్పులను తస్కరించటానికే నిశ్చయించాడు. కోతిపుండు బ్రహ్మరాక్షసి అయినట్టయింది. సుబ్బయ్య ఆ చెప్పులు తన వన్నప్పుడే వాటిని వాడి మొహాన పారేస్తే పోయేది. బజారులో పది మందీ దొంగ అని పోతారని భయపడి తాను సుబ్బయ్యను బుకాయించాడు. రేపు న్యాయస్థానంలో దొంగ అనిపించుకుంటే ఇక ఆ బస్తీలో తనకు మంచి నీరు కూడా పుట్టదు. అందుచేత కోటయ్య ఎంత అవస్త



పడి అయినా సరే సుబ్బయ్య పాత చెప్పులు సంగ్రహించ దలిచాడు.

కోటయ్య సుబ్బయ్య వెనకనే బయలుదేరి చీకటి పడినాక వాళ్ళ గ్రామం చేరుకున్నాడు ; సుబ్బయ్య ఇంటి పక్కనే నక్కి లోపల జరిగే సంభాషణ విన్నాడు. సుబ్బయ్య తన భార్యకు జరిగిన దంతా చెప్పి, " నా పాత చెప్పులను ఎక్కడ ఉంచావు ? వాటిని రేపు న్యాయాధికారికి చూపిస్తే గాని నా కొత్త చెప్పులు నాకు రావు !'' అన్నాడు.

" ఇంటి వెనక చూరు కింద దాచాను,'' అన్నది సుబ్బయ్య భార్య.

ఈ రహస్యం తెలియగానే కోటయ్య ఆ పాత చెప్పుల కోసం వెతికి వాటిని తీసుకుని బస్తీకి పోతూ, దారిలో కనిపించిన ఒక పెద్ద పొదలోకి వాటిని విసిరిపుచ్చుకు గిరవాటు వేశాడు.

అత నీ పని చేసిన మరుక్షణం నలుగురు దొంగలు అతన్ని పట్టుకుని, అతని వేళ్ళ ఉంగరాలు లాక్కుని పారి పోయారు.

మర్నాడు న్యాయస్థానానికి కోటయ్యలాగే సుబ్బయ్య కూడా వట్టి చేతులతో హాజ రయాడు. "నీ పాత చెప్పులు తెచ్చావా?" అని న్యాయాధికారి అడిగితే అతను, "అవి నిన్న సాయంకాలం కూడా ఇంటి చూరు కింద ఉన్నాయి. తెల్లవారి ఎంత వెతికినా దొరక లేదు," అన్నాడు.

న్యాయాధికారి ఒక భటుడికి సంజ్ఞచేయగా వాడొక పాత చెప్పుల జత తెచ్చాడు. సుబ్బయ్య వాటిని గుర్తించి, "అవే నా చెప్పులు," అన్నాడు ఆశ్చర్యంతో.

వాటిని చూసి తెల్లమొహం వేసిన కోటయ్యతో న్యాయాధికారి, "ఈ చెప్పులను ఒక పొదలో పారేసిన మనిషిని దొంగలు నిన్న రాత్రి దోచారు. మీ వస్తువు లేమీ పోలేదుగద?" అని అడిగాడు.

కోటయ్య మాటలు తడబడుతూండగా, "లేదే," అన్నాడు.

న్యాయాధిపతి ఒక పొట్లంలో నుంచి ఉంగరాలు తీసి, "ఇవి మీ ఉంగరాల్లాగే ఉన్నాయి? వీటినే దొంగలు పాత చెప్పుల దొంగ నుంచి లాక్కున్నారు," అన్నాడు.

కోటయ్య దొంగతనం బయట పడి పోయింది. అతను కొత్త చెప్పులు దొంగి లించినందు కొక జరిమానా, పాత చెప్పులు దొంగిలించి నందుకు అంతకు రెట్టింపు జరి మానా చెల్లించుకుని, చెప్పుల దొంగ అని శాశ్వతమైన కీర్తి తెచ్చుకున్నాడు.

సుబ్బయ్య ఎలాగైతేనేం తన కొత్త చెప్పు లను తిరిగి సంపాదించుకున్నాడు.





# కుదువ పెట్టిన కణితి

జపాను దేశంలో కొండల మీద అరణ్యాల మధ్య ఒక చిన్న గ్రామం ఉండేది. ఆ గ్రామంలో అందరూ కట్టెలుకొట్టి జీవించే వాళ్ళే. ఆ గ్రామంలో ఇద్దరి గవదలకు పెద్ద పెద్ద కణుతు లుండేవి. ఒకడికి కుడి చెంపనా, రెండోవాడికి ఎడమ చెంపనా ఈ కణుతు లుండేవి. అందుచేత మిగిలిన కట్టెలుకొట్టే వాళ్ళందరూ వాళ్ళను "కుడి చెంపా", "ఎడమ చెంపా" అని పిలిచే వాళ్ళు.

"కుడి చెంప" అనే వాడు సజ్జనుడు, స్నేహపాత్రుడు; ఒకరిని చూసి ఓర్చలేక పోవటమన్నది వాడి కేకోశానా లేదు. చెంపన కణితి ఉన్నప్పటికీ, దానికి చికిత్స ఏమీలేదు గనక మనసును సరిపెట్టుకుని, పెళ్ళాడి, తన భార్యతో సుఖంగా కాపరం చేస్తున్నాడు.

"ఎడమ చెంప" అలా కాదు. వాడికి "కుడి చెంప" మీద తప్ప మిగిలిన గ్రామస్తు లందరి మీదా అసూయే. మళ్ళీ అందరి సహాయమూ కోరే వాడు, ఏది కావలిసినా అడిగి తీసుకునే వాడు; అయినా అందరి మీదా కసిగా ఉండే వాడు. "కుడి చెంప" తనలాగా ఒంటరి జీవితం జీవించి, ఇంటి పనులన్నీ తానే చేసుకోవటం లేదని "ఎడమ చెంప"కు అప్పుడప్పుడూ అసూయ కలుగు తూనే ఉండేది; కాని మిగిలిన వాళ్ళ పైన ఉన్నంత కసి "కుడి చెంప" మీద ఉండేది కాదు. తన కేదన్నా చీపురో, చాటో కావలిసి వస్తే అరువుకు "కుడి చెంప" ఇంటికే వెళ్ళేవాడు. తనకు కావలిసిన వస్తు వేదో తీసుకుంటూ, "వస్తువైతే మీ రిచ్చారు గాని, చాకిరీ అంతా నేనే చేసుకోవాలి! ఆడ దిక్కులేని సంసారం!" అని పొడిచి నట్టుగా అనే వాడు. వాడి అసూయను "కుడి చెంపా", వాడి భార్యా పట్టించుకునే వారు కారు.

టి. నారాయణమూర్తి




ఒకనాడు "కుడి చెంప" తన రంపమూ, గొడ్డలీ, తాళ్ళూ తీసుకుని కట్టెలు కొట్టటానికి కొండ ఎగువన ఉన్న అరణ్యంలోకి వెళ్ళాడు. వాడు మోయగలిగినన్ని కట్టెలు కొట్టి, మోపుకట్టి, తన పనిముట్లు తీసుకుని గ్రామానికి దిగి పోబోతుండగా, పెళపెళార్భాటాలతో వాన సాగింది. అది మామూలు వానకాదు, ప్రచండమైన గాలివాన. కొండల మీద అక్కడక్కడా పిడుగులు పడసాగాయి. ఆకాశాన మెరుపులు మెరిశాయి. ధారాపాతంగా వర్షం కురిసింది.

"కుడి చెంప"కు పరిగెత్తిపోయి ఇంట్లో పడాలనే ఉన్నది గాని, నెత్తిన పెద్ద బరువున్నది. అప్పటికీ పరుగు ప్రారంభించాడు. కాని చెట్లు కూలుతున్నాయి. వాడికి పోలేనని భయం పట్టుకున్నది. అయితే అదృష్టవశాత్తూ సమీపంలో వాడి కొక బ్రహ్మాండమైన దేవదారు చెట్టులో పెద్ద తొర్ర కనబడింది. వాడు చప్పున అందులోకి దూరాడు. తొర్ర విశాలంగా ఉన్నది. లోపల పొడిగా ఉన్నది. వాడు తన మోపును దించుకుని, గొడ్డలీ, రంపమూ ఒక పక్కన పెట్టి, సుఖంగా కూర్చుని ఒక నిద్ర కూడా తీశాడు.

సూర్యాస్తమయం వేళకు గాలి వాన నిలిచిపోయింది. ఇక బయలుదేరవచ్చుననుకుని, "కుడి చెంప" తన కట్టెల మోపు ఎత్తుకుని, పనిముట్లు తీసుకుని ఇంటి దారి పట్టాడు. పూర్తిగా చీకటిపడేలోగా అరణ్యం దాటాలన్న ఉద్దేశంతో వాడు సాధ్యమైనంత వేగంగానే నడిచాడు. అయినా మధ్య దారిలోనే చీకటి పడింది. వాడు దారి తప్పుతానేమోనన్న భయంతో, దారి ఎంత దూరం కనిపిస్తున్నదో చూడటానికి తల ఎత్తే సరికి దూరాన ఒక దివిటీ కనబడింది. అది చూసి వాడు, ఎవరై ఉంటారా అని ఆశ్చర్యపడుతుండగా దాని పక్కన మరొక దివిటీ, దాని వెనకనే ఇంకా అనేక దివిటీలూ కనపడ్డాయి.

తన గ్రామం వాళ్ళే అయి ఉంటారనీ, తాను అరణ్యంలో చిక్కుపడి పోయి ఉంటాడన్న భయంతో దివిటీలు వేసుకుని వస్తున్నారనీ అనుకుని వాడు, "ఆగండి, ఆగండి! నే వచ్చేస్తున్నాను!" అని కేక పెట్టాడు. కాని దివిటీలు ఆగలేదు, జవాబు కూడా రాలేదు. వాడు మళ్ళీ కేక పెట్టాడు. దానికీ జవాబు లేదు.

దివిటీలు మరింత సమీపం అయే సరికి "కుడి చెంప"కు భీతి కలిగించే విషయం ఒకటి కంటబడింది—దివిటీలు వాటంతట అవే వస్తున్నాయి! వాటిని పట్టుకున్న మనుషుల జాడలేదు! అవి కొరివిదయ్యాలు కావచ్చు, పిశాచాలూ, భూతాలూ, ఏవైనా కావచ్చు. పట్టరాని భయంతో "కుడి చెంప" వెనక్కు తిరిగి, వచ్చినదారే పట్టి పరిగెత్త సాగాడు. ఎగువమార్గం కావటంచేత పరుగు మరింత కష్టమయింది. వాడు నెత్తి మీద ఉన్న కట్టెలమోపు ఒక పక్క గిరవాటు వేసి, తిన్నగా చెట్టు తొర్ర వద్దకు చేరుకుని, అందులో దాక్కున్నాడు.

దివిటీలు కూడా ఆ చెట్టు సమీపంలో ఉన్న ఖాళీ స్థలంలోకే వచ్చి నిలిచాయి. ఇప్పుడా దివిటీలను పట్టుకున్న ఆకారాలు కొంతవరకు స్పష్టంగానే కనిపిస్తున్నాయి. ఒక దానికి కప్ప తల, ఒక దానికి పక్షి





కాళ్ళు, మరొకదానికి జింక పాదాలు, మరొకదానికి ఎలుగుబంటి తల—అన్నిటిలోనూ మనిషి లక్షణాలూ, పశువుల లక్షణాలూ కలిసి ఉన్నాయి.

"మంట చెయ్యండి!" అన్న కేక వినిపించింది.

"పాడికట్టెల కట్ట దొరికింది, అదృష్టం! ఎవరో పారేసుకున్నారు," అని ఇంకొక కంఠం అన్నది. క్షణంలో మంట తయారయింది. ఆకారాలన్నీ మంట చుట్టూ వలయంగా ఏర్పడి, దివిటీలు పైకెత్తి నృత్యం చేయసాగాయి. వాటి సరదా చూస్తూన్న కొద్దీ "కుడి చెంప"కు వాటిని చూస్తే భయం పోయింది. అవి ఒకరికి హాని చేసేవిలాగా కనిపించలేదు. అతను చెట్టు తొర్రలో నుంచి బయటికి వచ్చాడు. "మనిషి! మనిషి!" అని అవి ఆనందంతో కేకలు పెట్టాయి.

"ఎవరు నీవు? ఏం పని చేస్తావు?" అని ఒక ఆకారం అడిగింది.

"నేను కట్టెలు కొట్టేవాణ్ణి. నేను కొట్టిన కట్టెలే మీరు చలిమంట వేసుకుంటున్నారు. నా పేరు 'కుడి చెంప'. ఈ కణితి చూడండి," అన్నాడు "కుడి చెంప."

"ఈ కణితి ఎంత అందంగా ఉందో!" అన్న దొక ఆకారం.

"మీ రెవరు?" అన్నాడు "కుడి చెంప." ఆ ఆకారాలు తన కణితి చూసి ఆనందించి నందుకు ఆశ్చర్యపడి.

"మేము భూతాలమూ, ప్రేతాలమూ, పిశాచాలమూ, ఏదీ కాము. మే మసలు ఈ లోకం వాళ్ళమే కాము," అన్నాయి ఆకారాలు.

"మీ నృత్యం చాలా బావుంది. మా కట్టెలు కొట్టే నృత్యం ఇంకో మాదిరిగా ఉంటుంది," అన్నాడు "కుడి చెంప".

"కట్టెలు కొట్టే నృత్యమా? ఏదీ, చేసి చూపించు, మేము కూడా ఆనందిస్తాం!" అన్నాయి ఆకారాలు.

"కుడి చెంప" ఒక చేత గొడ్డలీ, ఇంకొక చేత రంపమూ పట్టుకుని, వాటితో కట్టెలు కొట్టటమూ, కొమ్మలు కోయటమూ అభిన యిస్తూ, చాలా నాజూకుగా కట్టెలు కొట్టే నృత్యం చేసి చూపించాడు.

ఆ ఆకారాలు పరమానందం చెంది, చప్పట్లు చరిచి, ఈలలు వేసి "కుడి చెంప"ను ప్రోత్సహించాయి.

"భలే నృత్యం! మాకు కూడా నేర్పు!" అని అవి కేకలు పెట్టాయి.

"చాలు, చాలు! తెల్లవార వస్తున్నది! ఇక మనం వెళ్ళాలి," అన్నది మనిషి ముఖం గల ఆకారం.

"రేపు రాత్రికి ఇక్కడికే రా! తప్పక వస్తావు కదా?" అన్నాయి మిగిలిన ఆకారాలు.

"వస్తాను. వచ్చి మీకు మా నృత్యం నేర్పుతాను," అన్నాడు "కుడి చెంప" చాలా సంతోషంగా.

"ఊరికే మాట అనటం కాదు. నీ వస్తు వేదైనా కుదవపెట్టి మరీ వెళ్ళు," అన్నది మనిషి ముఖం.

"అతని రంపం, గొడ్డలీ తీసుకుందాం!" అన్నాయి మిగిలిన ఆకారాలు.

"అటువంటివి పోతే లక్ష్యం చేస్తాడా? ఇదుగో ఈ కణితి తీసుకుందాం!" అంటూ





జరిగినదంతా చెప్పాడు. ఆ సమయంలోనే "ఎడమ చెంప" అక్కడికి వచ్చాడు. "కుడి చెంప" కుండిన కణితి పోవటం చూసి వాడికి పట్టరాని అసూయ కలిగింది. సంగతంతా విన్నాక వాడు "కుడి చెంప"తో, "ఈ రాత్రికి నన్ను వెళ్ళనీ. నేను కూడా నా కణితి పోగొట్టుకుంటాను," అన్నాడు.

"అయితే ఈ రాత్రికి నీవు వెళ్ళు. కాని, వస్తానని మాట ఇచ్చాను గద, రేపు రాత్రికి తప్పక వస్తానన్నానని వాళ్ళతో చెప్పు. లేక పోతే మర్యాదగా ఉండదు," అన్నాడు "కుడి చెంప".

ఆ రాత్రి "ఎడమ చెంప" వెళ్ళి తొర్రలో కూచున్నాడు. చీకటిపడగానే వాడు కట్టెలు పోగుచేసి ఆ ఆకారాల కోసం మంట వేసి సిద్ధంగా ఉన్నాడు. ఆకారాలు అర్ధ రాత్రి దాకా రాలేదు. అవి వస్తూనే, "మన కోసం ఎవరో మంట చేశారు. కాని ఆ వచ్చిన వాడు 'కుడి చెంప' కాదు," అన్నాయి. అవి మంట చుట్టూ నృత్యం చేస్తూంటే "ఎడమ చెంప" తొర్రలో నుంచి బయటికి రావటానికి భయపడ్డాడు.

నృత్యం పూర్తి కాగానే వాడు తొర్రలో నుంచి బయటికి వచ్చి ఆ వింత ఆకారాలకు కనబడ్డాడు.

మనిషి ముఖం గల ఆకారం కట్టెలు కొట్టే వాడి కుడి చెంపన ఉన్న కణితిని పుణికింది. ఆ కణితి కాస్తా దాని చేతిలోకి ఊడి వచ్చింది. అంతలోనే ఆకారాలన్నీ అదృశ్యమైపోయాయి.

"కుడి చెంప" తన ముఖం రెండు పక్కలా తడువుకున్నాడు. రెండు పక్కలూ నున్నగా, ఒకే విధంగా ఉన్నాయి. ఎన్నేళ్ళుగానో ఉన్న కణితి కాస్తా మంత్రించినట్టు పోయింది. వాడు తన అనుభవాన్ని తానే నమ్మలేకుండా ఇంటిదారి పట్టాడు.

వాడు ఇంటికి చేరుకున్నాక వాడి భార్య మరింత ఆశ్చర్యపడింది. వాడు ఆమెతో

"నీ వెవరు? 'కుడి చెంప' ఎందుకు రాలేదు? వస్తానని మాట ఇచ్చాడే?" అన్నది మనిషి ముఖం.

"రేపు వస్తా నన్నాడు. మీతో చెప్ప మన్నాడు," అన్నాడు "ఎడమ చెంప", భయపడుతూ.

"'కుడి చెంప' మాకు కట్టెలు కొట్టే నృత్యం నేర్పుతా నన్నాడు," అన్నది మనిషి ముఖం.

"ఆ నృత్యం నాకూ వచ్చు. నేనే నేర్పు తాను," అన్నాడు "ఎడమ చెంప".

"ఏదీ చేసి చూపించు," అన్నాయి ఆకారాలు.

"ఎడమ చెంప" కట్టెలు కొట్టే నృత్యం ప్రారంభించి, "ఇదుగో ఇలా గొడ్డలి ముందుకు చాచి, ఇలా ఒక అడుగు ముందుకు వేసి—"అని వివరించ సాగాడు.

"వివరాలు తరవాత చూద్దాం. ముందు నృత్యం చేసి చూపించు. నిన్ను చూస్తూ మేమందరమూ నేర్చుకుంటాం," అన్నది మనిషి ముఖం.

"ఎడమ చెంప" నృత్యం అంతా చేశాడు. కాని ఆకారాలలో ఎలాటి చలనమూ లేదు. అవి చప్పట్లు కొట్టలేదు, ఈలలు వెయ్యలేదు.

"నీ నృత్యం ఏమీ బాగా లేదు. 'కుడి చెంప' చక్కగా చేశాడు. కాని అతను మమ్మల్ని నమ్మించి మోసపుచ్చాడు. ఇదుగో, అతను కుదవబెట్టిన కణితి అతనికి తిరిగి ఇచ్చెయ్యి," అంటూ మనిషి ముఖం తన చేతిని వాడి కుడి చెంపకు తాకించింది. "ఎడమ చెంప"కు కుడి వైపున కూడా పెద్ద కణితి ఏర్పడింది.

"ఈ కణితి నాకు వద్దు. రేపు 'కుడి చెంప' వచ్చినప్పుడు వాడికే ఇవ్వండి," అని "ఎడమ చెంప" గోలెత్తాడు.

"తెల్లవార వచ్చింది. పదండి, పదండి!" అంటూ ఆకారాలు గాలిలో కరిగిపోయాయి.





# విజయ ఘోష

పూర్వం విభాండకు డనే రాజుండే వాడు. ఆయన గొప్ప బలశాలి. యుద్ధ మంటే అమితోత్సాహం గల వాడు. దానికి తోడు యుద్ధ విద్యలో ఆరితేరిన వాడు. అందు చేత ఆయన చీటికీ మాటికీ ఇరుగుపొరుగు రాజులతో ఏదో ఒక సాకు మీద యుద్ధానికి తరలిపోయి, యుద్ధం చేసి శత్రువులను చిత్తుగా చావగొట్టి వస్తూండే వాడు. దాదాపు ప్రతి మాసమూ ఏదో ఒక దండయాత్ర చేసి విభాండకుడు విజయ దుందుభి మోగిస్తూనే ఉండే వాడు.

ఒకవేళ ఏ నెలగానీ యుద్ధం జరగక పోతే విభాండకుడు సైన్యసమేతుడై అరణ్యానికి వెళ్ళి వన్యమృగాలను వేటాడి, విజయ ధ్వానాలు చేసుకుంటూ ఇంటికి తిరిగివచ్చే వాడు.

అస్తమానమూ విజయదుందుభి మోగుతూ ండటమూ, నగరమంతటా విజయ ధ్వానాలు మిన్ను ముట్టుతూ ండటమూ ఆయనకు గొప్ప సరదా.

ఆయన వద్ద ఉండే విజయ దుందుభి ప్రచండమైనది. ఇది గాక విజయ ధ్వానాలు చెయ్యటానికి ఆయన వెంట భేరీలూ, డప్పులూ, డోళ్ళూ ఉండేవి. వీటన్నిటివల్లా ఉప్పతిల్లే ఘోష మహా దారుణంగా ఉండేది. ఎడ తెరిపి లేకుండా సాగే ఈ ఘోషకు పేదవాళ్ళ గుడిసెలు కూలి పోతూండేవి. పచ్చిగోడలు బీటలు పడేవి. జనానికి మతులు పోయేవి. చాలా మందికి అసలు నిద్రే పట్టేదికాదు.

కాని అందరి కన్న బాగా దెబ్బ తిన్న వాళ్ళు కుమ్మరులు. వాళ్ళ ఇళ్ళ సమీపంగా రాజు, ఏ యుద్ధం నుంచో, వేట నుంచో తిరిగివస్తూ, విజయ ఘోష చేసు కుంటూ వెళ్ళినప్పు డల్లా వాళ్ళు తయారు చేసిన మట్టి పాత్రలు పగుళ్ళు చూపేవి.

జి. రామచంద్రయ్య

ఎంతో శ్రమ పడి చేసిన పని అంతా పాడై పోయేది. ఈ బెడద లేకుండా వాళ్ళకు ఏ నెలా గడిచేది కాదు.

ఇలాటి పరిస్థితిలో వాళ్ళు కూడ బలుక్కుని, మంత్రిగారిని దర్శించి, రాజుగారి విజయ ఘోష వల్ల తమ వృత్తి సాగకుండా ఉన్నదని మొరపెట్టుకున్నారు. మంత్రిగారు రాజుగారి అభిప్రాయం తెలుసుకుంటానని వారికి మాట ఇచ్చి, చల్లగా వారి మొర రాజుగారికి అందజేశాడు.

రాజుగారు మంత్రి చెప్పినది విని మండిపడి, "కుమ్మరి వెధవల కోసం విజయ దుందుభి మోగించటం మానుతామా? తమ వృత్తి చేసుకోలేకపోతే ఇంకో వృత్తి చేసుకోమను, లేదా దేశం విడిచి పొమ్మను!" అని మంత్రితో అన్నాడు.

మంత్రి కుమ్మరుల కీ మాట చెప్పి, "ఇంకొకసారి ఇలాటి మాట అన్నారంటే రాజుగారు మిమ్మల్ని నిలువునా చీల్చేస్తారు. పొండి," అన్నాడు.

కుమ్మరులు హతాశులైనారు. వారు ఏక గ్రీవంగా నిశ్చయించుకుని దేశం విడిచి మరొక దేశానికి వెళ్ళి అక్కడ తమ వృత్తి సాగించుకున్నారు.

కాని ఆ సమస్య అంతటితో పోలేదు. మట్టి పాత్రలు వాడుకునే పేద ప్రజలకు



బతుకు దుర్భరమయింది. కుండలు లేక వాళ్ళు వంట చేసుకో లేరు, నీరు తెచ్చుకో లేరు. ఆ రకం ప్రజలు కూడా దేశం వదిలి పోవలిసి వచ్చింది.

కుమ్మరులు లేకపోవటంతో, రాజ్యం లోని వైద్యులకు కూడా చెయ్యి పడి పోయినట్టయింది.

వాళ్ళు పుటాలు పెట్టాలంటే ప్రమిదెలు కావాలి, కషాయాలు కాచటానికి మూకుళ్ళూ, కుండలూ కావాలి. మట్టి పాత్రలు లేకుండా వారికి జరగదు.

దేశం నుంచి కుమ్మరులు వెళ్ళి పోవటం చేత జీవితం ఎంత తారుమారయినదీ రాజుకు తెలియదు. ఆయనకు మళ్ళీ ఒక యుద్ధం దొరికింది. ఆయన జయభేరి మోగించి యుద్ధానికి వెళ్ళి, యుద్ధంలో శత్రువును జయించినప్పటికీ బాగా గాయ పడి విజయ ఘోషలు చేసుకుంటూ రాజ భవనానికి తిరిగి వచ్చాడు.

రాజుగారికి కలిగిన గాయాలకు మందులూ, పూతలూ వేయటానికి వైద్యు లను పిలిపించారు. కాని వారి వద్ద అవసర మైన మందులు లేవు. "మహారాజా, మాకు కుండలూ, మూకుళ్ళూ దొరకని కారణం చేత చాలా ఔషధాలు తయారు చేయలేని స్థితిలో ఉన్నాం. మా వైద్య వృత్తి సగం కుమ్మరులతోనే పోయింది," అని వైద్యులు మొరపెట్టుకున్నారు.

చికిత్స లేని కారణం చేత రాజుగారి గాయాలు ముదిరి ఆయనను మంచంలో పడేశాయి. పరిస్థితి విషమించేటట్టు కన బడింది. ఆ స్థితిలో ఆయన కళ్ళు తెరిచి కుమ్మరులను మళ్ళీ పిలిపించాడు. వారు వచ్చి కుండలు చేసిన మీదట వైద్యులు ఔషధాలు తయారు చేసి రాజుగారికి చికిత్స చేశారు.

ఆ తరువాత ఆ దేశంలో విజయఘోష చాలా వరకు శాంతించింది.






లంక అంతా పరశురామ ప్రీతి చేసిన హనుమంతుడు అశోకవనంలో ఉన్న సీత వద్దకు తిరిగి వచ్చి, ఆమెకు నమస్కారం చేసి, "నా అదృష్టం చేత నీ కేమీ అపాయం కలగలేదు. రాముడు త్వరలోనే వానరులనూ, భల్లూకాలనూ వెంట బెట్టుకుని వస్తాడు. నాకు సెలవిప్పించు," అన్నాడు.

అతను ఆమె వద్ద సెలవు పుచ్చుకుని అరిష్టమనే పర్వతం పైకి ఎక్కి సముద్రం పైకి చూసి తన శరీరాన్ని పెంచాడు. అతను ఒక్కసారి బలంగా తొక్కగానే ఆ పర్వతంలోని శిలలు పిండి అయాయి; అందులో ఉండే మృగాలన్నీ భయపడి చెల్లాచెదరుగా పరిగెత్తాయి. హనుమంతుడు అవతలి ఒడ్డుకు ప్రయాణమైన వాడై ఆకాశంలోకి లేచాడు. అతను మేఘాల మధ్య కనిపిస్తూ, మాయమవుతూ, సముద్రంలో వెళ్ళే ఓడలాగా గాలిలో తేలిపోతూ, సముద్రాన్ని లంఘించాడు. త్వరలోనే అతనికి అంతదూరాన మహేంద్ర పర్వతం కనబడింది. దాన్ని చూస్తూనే అతను ఉత్సాహంతో గట్టిగా సింహ నాదం చేశాడు.

హనుమంతు డెప్పుడు వస్తాడా అని ఆత్రంగా ఎదురు చూస్తున్న అంగదుడు మొదలుగాగల వానరులకు ఆ సింహ నాదం విని పరమానందమయింది. అందరికీ పెద్దవాడయిన జాంబవంతుడు వానరులందరినీ చేరదీసి, "మన హనుమంతుడు పని చక్కబెట్టుకుని మరీ వస్తున్నాడు. అతని కంఠ ధ్వని వింటే అలాగే తోస్తున్నది," అన్నాడు.



వానరులు ఆనందంతో కుప్పి గంతులు వేశారు. కొందరు హనుమంతుణ్ణి చూడ టానికి చెట్లెక్కి, అతన్ని పిలుస్తున్నట్టుగా కొమ్మ లాడించారు. అంతలోనే హను మంతుడు వచ్చి మహేంద్రపర్వతం మీద దిగాడు. వానరులంతా అమితోత్సాహంతో అతన్ని చుట్టు ముట్టారు. అతనికి పళ్ళూ, దుంపలూ అందించారు.

హనుమంతుడు జాంబవంతుడిలాటి పెద్ద లకూ, యువరాజైన అంగదుడికీ నమస్కా రాలు చేసి, "చూశాను సీతను," అని స్పష్టంగా చెప్పేశాడు. అతను అంగదుణ్ణి ఆలింగనం చేసుకుని, అందరూ కూర్చోవ టానికి మహేంద్రగిరి పైన ఒక సుందర స్థలం చూశాడు.

హనుమంతుడు సీతను చూశానన్న శుభ వార్త చెప్పగానే వానరులు కొందరు సింహ నాదాలు చేశారు. కొందరు కేకలుపెడితే మరి కొందరు జవాబులిచ్చారు, ఇంకొందరు రాళ్ళమీదుగా దూకుతూ, అతణ్ణి తాకారు.

అప్పుడు అంగదుడు, "హనుమంతుడా, నూరు యోజనాల సముద్రాన్ని అటూఇటూ కూడా దాటి నీకు సాటి లేదనిపించావు. మా అందరి మానాన్నీ కాపాడావు. అంతేకాదు, సీతాదేవిని కూడా చూశావు," అన్నాడు. హనుమంతుడు చెప్పబోయే విశేషాలు విన టానికి వానరులందరూ ఆత్రంగా ఉన్నారు.

జాంబవంతుడు హనుమంతుడితో, "సీత నీ కెలా కనపడింది? ఆమె అక్కడ ఎలా ఉన్నది? ఆమె పట్ల రావణు డెలా ప్రవర్తి స్తున్నాడు? ఉన్న సమాచార మంతా దాచ కుండా చెప్పు. అందులో రాముడికి చెప్ప వలసినదేదో, చెప్పగూడనిదేదో మనం తరవాత తేల్చుకుందాం," అన్నాడు.

హనుమంతు డీ విధంగా చెప్పసాగాడు:

"నేను బయలుదేరటం మీరు చూశారు గదా. కొంతదూరం వెళ్ళేసరికి ఒక అంద మైన బంగారు పర్వత శిఖరం నా దారి

కడ్డు తగిలింది. అది నన్ను ప్రేమగా పలకరించి, తాను మైనాకుణ్ణనీ, నా తండ్రి అయిన వాయుదేవుడు తనను ఇంద్రుడి నుంచి కాపాడాడనీ చెప్పింది. మైనాకుడి వద్ద సెలవు పుచ్చుకుని చాలా దూరం వెళ్ళాక సర్పమాత అయిన సురసాదేవి ఎదురై నన్ను మింగుతానన్నది. అంగుళం దేహంతో ఆమె నోట ప్రవేశించి వెంటనే బయటికి వచ్చి దారి పుచ్చుకున్నాను."

ఈవిధంగా ప్రారంభించి హనుమంతుడు, తాను చీకటిపడ్డాక లంకానగరం ప్రవేశించటమూ, లంకను జయించటమూ, లంక అంతా గాలించిన మీదట అశోకవనంలో ఒక శింశుపా వృక్షం కింద సీత కనిపించటమూ మొదలైన విషయాలన్నీ వివరంగా చెప్పాడు. చివర కతను ఇలా అన్నాడు:

"సీత మహా పతివ్రత అనటానికి సందేహం లేదు. ఆమె రాముడి కొరకే జీవిస్తూ చాలా కష్టాలకు గురి అవుతున్నది. నేనొక్కణ్ణే లంకను బూడిద చేసి వచ్చినప్పుడు మన మందరమూ కలిసి రావణుడి బలాలన్నిటినీ హతమార్చ లేక పోతామా? మనలో ఎవరు తక్కువ? జాంబవంతుడూ, అంగదుడూ, పనసుడూ, నీలుడూ, అజేయులైన మైందద్వివిదులూ...ఇందరున్నారు.



మనం రావణుణ్ణి చంపి సీతను రాముడి వద్దకు చేర్చటం బాగుంటుందేమో!"

అంగదుడు హనుమంతుడి మాటను బలపరుస్తూ, "మనం సీతను చూసి కూడా ఆమెను తీసుకు పోకపోవటం అనుచితం. రాముడి వద్దకు వెళ్ళి, 'సీతను చూశాం, కాని తీసుకు రాలేదు,' అనటం ఏమీ బాగుండదు. అసలు హనుమంతుడు అక్కడి రాక్షస వీరులందరినీ చంపనే చంపాడు. సీతను తీసుకు రావటం తప్ప మనకు పెద్ద పని కూడా లేదు," అన్నాడు.

ఈ మాట విని జాంబవంతుడు, "యువరాజా, నీది చాలా మంచి ఆలోచనే. దీన్ని



గురించి రాముడే మంటాడో తెలుసుకుని ఆయన చెయ్యమన్నట్టు చేద్దాం," అన్నాడు లౌక్యంగా. దీనికి అంగదుడే గాక మిగిలిన వానర వీరులు కూడా సమ్మతించారు.

తలపెట్టిన పని సానుకూలం కావటమూ, రాముడికి చెప్పవలిసిన సమాచారం ఉండటమూ, యుద్ధంచేసే అవకాశం ఉండటమూ మొదలైన అంశాలతో వానరులు ఉద్రేకోత్సాహాలు చెంది తిరుగుముఖం పట్టారు. వారు గాలిలో ఎగురుతూ మధువనం చేరుకుని, అంగదుడి అనుమతితో అక్కడి చెట్ల మీద ఉన్న తుట్టెల నుంచి తేనె తాగారు, సంతోషం పట్టలేక రకరకాల ఆటలాడారు, కేకలు పెట్టారు, ఒకరి నొకరు తరుముకున్నారు, చెట్ల మీదుగా పరిగెత్తారు.

మధువనానికి రక్షకుడు దధిముఖుడు, సుగ్రీవుడి మేనమామ. వానరులు వనంలోని తేనె అంతా తాగెయ్యటమే గాక, చెట్లన్నీ ధ్వంసం చేసి, పూలన్నీ రాల్చెయ్యటం చూసి మండిపడి అతను వానరులను వనం విడిచి పొమ్మని కేక లేశాడు. వాళ్ళు వినిపించుకోలేదు. అతను కొందరిని కొట్టాడు. కొందరితో మంచి మాటలాడాడు. కొందరిని బతిమాలుకున్నాడు. కాని అందరూ అతన్ని పట్టుకుని ఏడిపించుకు తిన్నారు, కొందరతన్ని రక్కి, కొరికారు కూడా.

హనుమంతుడు వానరులకు ప్రోత్సాహమిస్తూ, "మీ ఇష్టం వచ్చినట్టు తేనె తాగండి. ఎవరడ్డొస్తారో నేను చూస్తాను," అన్నాడు.

అంగదుడు హనుమంతుణ్ణి బలపరుస్తూ, "హనుమంతుడు కూడని పని చెయ్యమన్నా నేను చేసేస్తాను. అలాటప్పుడు మంచి పని చెయ్యమంటుంటే మానట మెందుకూ!" అన్నాడు. వానరులు అంగదుడి మాటలకు హర్షధ్వానాలు చేశారు. వారు తేనె తాగిన కైపులో చిత్తం వచ్చినట్టు చేశారు. మధువనంలోని కాపలా వాళ్ళందరినీ కట్టేశారు, పళ్ళన్నీ తినేశారు. కొందరు సింహనాదాలు

చేశారు, కొందరు సన్నగా కూశారు, మరి కొందరు పడుకుని నిద్రపోయారు.

మధువన మంతా నాశనమవుతూండటం చూసి దధిముఖుడు తన కాపలా వాళ్ళ నందరినీ కూడగట్టుకుని, చెట్లూ, రాళ్ళూ మొదలైన ఆయుధాలతో అంగదాది వానర వీరులపై తలపడ్డాడు. హనుమంతుడు మొదలుగా గల వారు అతని మీద కలియ బడ్డారు. మత్తులో ఉన్న అంగదుడు, దధి ముఖుడు తన తాత అన్న స్ఫురణ కూడా లేకుండా, అతన్ని పడదోసి ఘోరంగా కుమ్మాడు. దధిముఖుడికి స్పృహ తప్పింది.

కొంతసేపటికి అతను తెలివి తెచ్చుకుని, తన చేతిలో ఉన్న చెట్టుతో తప్పతాగి ఉన్న వానరులను తరిమాడు. తరవాత అతను తన వారితో, "వీళ్ళందరినీ ఇక్కడే పడి ఉండనివ్వండి. నేను వెళ్ళి సుగ్రీవుడితో జరిగినదంతా చెబుతాను. తరవాత సుగ్రీవుడే వాళ్ళ తలలు తీసేస్తాడు," అని చెప్పి శీఘ్ర గమనాన సుగ్రీవుడి వద్దకు వెళ్ళాడు.

సుగ్రీవుడు తన మేనమామను చూసి ఆశ్చర్యపడి, "ఏమిటి విశేషం?" అని అడిగాడు.

"మీ నాన్నగారి కాలంలో గాని నీ కాలం లోగాని దేవతలకైనా ప్రవేశింపరాని మధు



వనాన్ని అంగదుడు మొదలైన వానరులు ధ్వంసం చేసి పెట్టారు. కావలివాళ్ళు పొమ్మంటే కొట్టారు, తల కిందులుగా వేళ్ళాడ గట్టారు. మధువనంలోని తేనె అంతా తాగేస్తున్నారు," అని దధిముఖుడు సుగ్రీవుడితో చెప్పాడు.

ఆ సమయంలో లక్ష్మణుడక్కడికి వచ్చి, దధిముఖుణ్ణి చూసి, "ఇతనేమిటో ఫిర్యాదు చేస్తున్నాడు?" అన్నాడు.

"సీతను వెతకటానికి దక్షిణంగా వెళ్ళిన నా వాళ్ళు మధువనానికి వస్తూనే వనమంతా అల్లకల్లోలం చేసి తేనెలు తాగేస్తున్నారట. పని సానుకూలం చేసుకురాకపోతే వారట్లా



ప్రవర్తించరు. వారు తప్పకుండా సీతను చూసే వచ్చారు. అందుకు సమర్థుడైన హనుమంతుడు వాళ్ళవెంట ఉండనే ఉన్నాడు. పని ముగించుకు వచ్చిన పొగరు లోనే వాళ్ళు కాపలా వాళ్ళను కూడా కొట్టారు," అన్నాడు సుగ్రీవుడు.

సుగ్రీవుడు చేసిన ఊహ రామలక్ష్మణు లకు పరమానందం కలిగించింది. సుగ్రీవుడు దధిముఖుడితో, "వానరులు మధు వనంలోని తేనె అంతా తాగినందుకు చాలా సంతోషించానని చెప్పు. వాళ్ళ కోసం నేనూ, రామలక్ష్మణులూ వేచి ఉన్నాం. వారిని త్వరగా రమ్మను," అన్నాడు.

దధిముఖుడు వారు ముగ్గురికీ ప్రణామం చేసి, శీఘ్ర గమనాన ఆకాశమార్గాన మధు వనానికి తిరిగివచ్చే సరికి వానరులకు కైపు దిగిపోయింది. అతను అంగదుడితో, "యువరాజా, మేము నిన్నడ్డగించామని కోపించకు. తెలియక పొరపాటు జరిగి పోయింది. నేను వెళ్ళి మీరు వచ్చినట్టు మీ పినతండ్రికి చెప్పగా, ఆయన సంతో షించి మిమ్మల్నందరినీ త్వరగా రమ్మ న్నాడు," అన్నాడు.

అంగదుడు తన వారితో, "మనం ఇక్కడ విశ్రాంతి తీసుకున్నాం గనక ఇక బయలుదేరుదాం. మనం వస్తున్న సంగతి రామలక్ష్మణులకు అప్పుడే తెలిసిపో యింది," అన్నాడు.

అంగదుడూ, అతని వెనకగా మిగిలిన వారూ ఆకాశంలోకి లేచారు. వారు కిష్కింధను చేరవస్తూ చేసిన సింహనాదాలు సుగ్రీవుడికి వినిపించాయి. అతను ఆనందంతో తోక చాచి ఆడించాడు. ఇంతలో వానరులు, హనుమంతుణ్ణీ, అంగదుణ్ణీ ముందుంచు కుని, రాముడున్న చోటికి వచ్చి వాలారు.

"వానరులారా, సీత ఎక్కడ ఉన్నది? నన్ను గురించి ఏ భావంతో ఉన్నది? అన్ని విషయాలూ నాకు వివరంగా చెప్పండి,"

అని రాముడు వానరుల నడిగాడు. వాన రులు హనుమంతుణ్ణి ముందుకు తోశారు.

హనుమంతుడు రాముడికి జరిగినదంతా చెప్పి, సీత ఇచ్చిన చూడామణిని రాముడి చేతిలో పెట్టి, "రామా, చిత్రకూటం మీద మీరుండేటప్పుడు కాకి ఉదంతం ఒకటి నీకు గుర్తుగా ఉండగలందులకు సీత చెప్పింది. తన కింకొక్క మాసమే గడువున్నదని నీతో చెప్పమన్నది. ఆమె చాలా అధైర్యం చెంది ఉన్నది. సముద్రం దాటి లంకకు వెళ్ళే ఉపాయం ఆలోచించండి," అన్నాడు.

సీత పంపిన చూడామణిని చూడగానే రామలక్ష్మణులకు దుఃఖం ఆగలేదు. రాముడు శోకవివశుడై, "సీత కనిపించ కుండా ఈ చూడామణి కనిపించటం కన్న వేరే దుఃఖ మేముంటుంది? సీత ఇంక ఒక్క నెలపాటే జీవించి ఉంటుందా? ఆమె ఉన్న చోటు తెలిసి అక్కడికి వెళ్ళ కుండా, ఇక్కడ ఒక్క నిమిషమైనా ఎలా ఉండటం? ఆ భయంకర రాక్షస స్త్రీల మధ్య సీత ఇంత కాలం ఎలా ఉన్నది?" అని ఆక్రోశించాడు.

అతను సీత అన్న మాటలన్నీ హను మంతుడి చేత చెప్పించుకుని విన్నాడు. హనుమంతుడు అంతా చెప్పి, "ఆమె నిన్ను సేనతో వచ్చి రావణుణ్ణి చంపి తనను కాపాడమన్నది. అందుకు తగిన ప్రోత్సాహం నన్నే ఇవ్వమన్నది. వానర సేనలు సముద్రం దాటి లంకకు రాలేవేమో నని ఆమె సంశయించింది. తనకు విమో చనం ఉండదేమోనని భయపడుతున్న సీతను నేను అనేక రకాల ఓదార్చాను. నన్ను మించిన వారు సుగ్రీవుడి వద్ద వేలాది వానరులున్నారని చెప్పాను. త్వరలోనే రావణుడు మొదలైన వారు నాశనమైపోతా రనీ, ఆమె తన భర్తతో అయోధ్యకు తిరిగి వెళుతుందనీ ధైర్యం చెప్పాను," అన్నాడు.

[ సుందరకాండ సమాప్తం ]





# ఆపద్రక్షకుడు

ఒకనాడు పాపన్న, పొరుగూరులో తన బంధువుల ఇంట ఏదో అక్కర అయితే వెళ్ళి, పొద్దుపోయి తిరిగి వస్తూండగా దారిలో ఒక గ్రామంలో అగ్ని ప్రమాదం అతని కంట పడింది. ఆ ఊరి గ్రామాధికారి ఇల్లు అంటుకున్నది. పదిమందీ అడావుడిగా కేక లేస్తూ, అటూ ఇటూ పరిగెత్తుతున్నారు. మనుషులు అంచెల మీద కడవలతో నీరు తెచ్చి పోస్తూ, నిప్పు ఆర్ప యత్నిస్తున్నారు.

మరికొందరు కాలుతున్న ఇంటి నుంచి దొరికినన్ని సామాన్లు లాగి బయటికి చేర వేస్తున్నారు.

ఇంటి వెనుక భాగంలో వంటావిడ నిల బడి, "అయ్యో, బిడ్డ! వంట ఇంట్లో చిక్కుకుపోయాడు! ఎవరైనా రండర్రా! వాణ్ణి బయటికి తీసుకు రండర్రా!" అని అరుస్తున్నది. కాని ఆమె కేకలు ఒక్కరూ వినిపించుకో లేదు.

ఆర్తనాదం విని పాపన్న అటుగా వెళ్ళే సరికి, కాలుతున్న ఇంటి వెనుక భాగంనుంచి కుర్రవాడి ఏడుపు వినిపించింది.

వెంటనే పాపన్న మంటల మధ్యగా లోపలికి జొరబడి, కుర్రవాణ్ణి ఎత్తుకుని, బయటికి వచ్చేశాడు.

అతను బయటికి అడుగుపెట్టిన మరు క్షణమే గ్రామాధికారి నౌక రొకడు పాపన్న చేతిలో నుంచి కుర్రాణ్ణి ఎగరేసుకుని తీసుకు పోయి, ఇంటి ముందు నిలబడి ఉన్న తన యజమానికి చూపించి, "బాబూ, అబ్బాయి గారు వంట ఇంటో మంటల మధ్య చిక్కుకు పోతే బయటికి తెచ్చాను. ఇంకా నయం! నేను పోయి రక్షించకపోతే బిడ్డ ఏమై ఉండునో!" అన్నాడు.

గ్రామాధికారికి తన నౌకరు పై కృతజ్ఞత పొంగిపొర్లి, "నాకు పుత్రభిక్ష పెట్టావురా! నీ ఋణం ఎన్ని జన్మాలకూ తీరదు,"



అన్నాడు, ఏడుస్తున్న తన కొడుకును గుండెకు అదుముకుంటూ.

ఈలోపల, పాపన్న చీకటిలో పడి అతి ప్రయాసతో తన ఇంటికి చేరుకున్నాడు. అతని బట్టలు కాలాయి, ఒళ్ళు చాలా చోట్ల కాలింది. తల్లి పాపన్నను చూసి దడుచుకుని, "ఏమిరా ఈ కాల్పులూ? ఏం జరిగింది?" అని అడిగింది.

పాపన్న జరిగినదంతా తన తల్లికి చెప్పాడు.

"లేనిపోని వాటి కన్నిటికీ సిద్ధమౌతావు దేనికిరా?" అని తల్లి తన కొడుకును గట్టిగా మందలించింది.

"'పరోపకారార్థ మిదం శరీరం,' అని గురువుగారు చెప్పారమ్మా," అని పాపన్న గొణుగుతూ, తన చొక్కా విప్పాడు. ఆ చొక్కా నుంచి ఏదో బరువుగా కింద పడింది. చూస్తే, బంగారు మొలతాడు, గ్రామాధికారి కొడుకుది. అది ఊడి పాపన్న చొక్కాకు తగులుకున్నట్టుంది. అగ్ని ప్రమాదం గొడవలో పాపన్న దాన్ని గమనించనే లేదు.

తన గాయాలకు మందు రాయవచ్చిన తల్లితో పాపన్న, "దీన్ని భద్రంగా ఉంచు. వాళ్ళకు తిరిగి ఇవ్వాలి," అన్నాడు.

కాని ఆ బంగారు మొలతాడు గ్రామాధికారికి వెంటనే తిరిగి ఇవ్వటం పడలేదు. మర్నాటికి పాపన్నకు గాయాల మూలంగా జ్వరం తగిలింది. రెండు మూడు లంఖణాలు చేసిన మీదటగాని పాపన్న కోలుకుని మామూలు మనిషి కాలేదు. చేతుల మీదా, ముఖానా కాలిన మచ్చలింకా పచ్చిగానే కనిపిస్తూ ఉన్నాయి.

అయినప్పటికీ పథ్యం తీసుకున్న మర్నాడే పాపన్న బంగారు మొలతాడుతో సహా గ్రామాధికారి ఇంటికి బయలుదేరి వెళ్ళాడు. కాలిపోయిన ఇల్లు తిరిగి కట్టుతున్నారు. పాపన్న దగ్గిర నుంచి బిడ్డను

ఎత్తుకుపోయి, తానే వాణ్ణి కాపాడినట్టు నటించిన నౌకరు అక్కడే ఉండి, పనివాళ్ళ పైన అజమాయిషీ చేస్తున్నాడు.

పాపన్న ఆ మనిషిని సమీపించి, "ఈ ఇంటివాళ్ళు ఎక్కడ ఉంటున్నారు?" అని అడిగాడు.

"అదుగో, ఆ కనబడే పెంకుటింటో ఉంటున్నారు. రేపో, ఎల్లుండో ఇల్లు పూర్తి కాగానే వస్తారు. ఎందుకూ?" అన్నాడు పాపన్నతో నౌకరు.

"మరేం లేదు. ఆనాడు ఈ ఇల్లు కాలి పోయేటప్పుడు నే నిటుగా వచ్చాను. ఇంట్లో నుంచి ఒక బిడ్డను బయటికి తెచ్చాను. ఆ బిడ్డను ఇంటివాళ్ళు ఆత్రంగా తీసుకుని వెళ్ళిపోయారు. ఆ సమయంలో వాడి బంగారు మొలతాడు నా చొక్కాలో చిక్కుకుంది. ఆ మొలతాడు సంగతి వాళ్ళూ గమనించ లేదు, ఇంటికి పోయి చొక్కా విప్పినదాకా నేనూ గమనించలేదు. గాయాల వల్ల సుస్తీ చేసి నేను వెంటనే రాలేక పోయాను. దీన్ని ఇంటివారి కిచ్చేద్దామని వచ్చాను," అన్నాడు పాపన్న.

ఈ మాటలు వినగానే నౌకరు గుండెలో రాయి పడింది. పాపన్న ఈ గొలుసు తీసుకు పోయి గ్రామాధికారి కిస్తే, అతని చేతులకూ,




ముఖానికీ ఉండే మచ్చలు చూసి, తన బిడ్డను రక్షించింది నౌకరుకాదనీ, ఈ మనిషే ననీ ఆయన తెలుసుకుంటాడు. ఆయన లోగడ నౌకరుకు మంచి బహుమతి ఇచ్చి ఉన్నాడు, ఇప్పుడు అంత కన్న మంచి శిక్ష పడుతుంది!

అందుచేత నౌకరు, "దాన్ని నా కివ్వండి. నేను వారి మనిషినే," అన్నాడు.

"ఎందుకులే, ఇంత దూరం వచ్చి నేనే ఇస్తాను. బంగారు వస్తువు కూడానూ!" అన్నాడు పాపన్న.

నౌకరు పాపన్నను అవతలికి తీసుకు పోయి, "బాబూ, నన్ను తమరు కాపాడాలి.

నేనే బిడ్డను రక్షించినట్టు చెప్పి, మా యజమాని దగ్గిర బహుమానం కూడా పుచ్చుకున్నాను. ఆ మొలతాడు కావలిస్తే మీరే ఉంచుకోండి, లేదా నా కివ్వండి. నేను వారికి ఏదో విధంగా అందజేస్తాను. అంతే గాని మీరుగా దీన్ని ఇవ్వవద్దు! మీ కాళ్ళు పట్టుకుంటాను,'' అన్నాడు.

వాడి స్థితి చూసి జాలిపడి పాపన్న బంగారు మొలతాడు వాడి కిచ్చి ఇంటికి తిరిగి వచ్చాడు.

నౌకరు దాన్ని తన యజమానికి ఎలా తిరిగి ఇవ్వాలో తెలియక కంసాలి వద్దకు తీసుకుపోయి కరిగించమన్నాడు.

దురదృష్టవశాత్తూ ఆ మొలతాడు చేసినది ఆ కంసాలే. అందుచేత అతను మొలతాడు చూస్తూనే, ఫలానా వారిదని గుర్తించి, గ్రామాధికారికి కబురు చేసి, "బాబూ, దీన్ని కరిగించమని మీ నౌకరు చేత పంపారా?'' అని అడిగాడు.

ఆ మొలతాడు పోయిందని అప్పుడే అందరూ కనుక్కున్నారు. కాని బిడ్డ ప్రాణం దక్కిందన్న తృప్తిలో, వెధవ మొలతాడు పోతే పోయిందిలే అనుకున్నారు.

తనకు పుత్రభిక్ష పెట్టాడనుకున్న తన నౌకరే మొలతాడు కాజేసి ఇంత కాలమూ తన దగ్గిర దాచుకున్నాడని తెలిసి గ్రామాధికారి మండిపడ్డాడు.

నౌకరును నిలవదీసి అడిగితే నిజం బయటపడింది. బిడ్డను మంటల నుంచి రక్షించిన వాడు నౌకరు కాడు, పక్క ఊరిలో ఉండే పాపన్న!

గ్రామాధికారి తన నౌకరును పనిలో నుంచి తొలగించి, పాపన్న ఇంటికి వచ్చి, తన బిడ్డణ్ణి కాపాడినందుకు కృతజ్ఞత తెలుపుకుని, పాపన్న వద్దంటున్నా వినకుండా పాపన్నకూ, అతని తల్లికీ మంచి మంచి బట్టలూ ఇతర కానుకలూ ఇచ్చి వెళ్ళిపోయాడు.



# 30. "బిగ్ బెన్"

ప్రపంచంలోని ప్రసిద్ధ గడియారాలలో చేరిన "బిగ్ బెన్" లండనులోని పార్లమెంటు భవనాలపై ఉన్నది. ఇది నూరేళ్ళకు పైగా నిర్దుష్టంగా పనిచేస్తున్నది. దీని "ముఖం" ఎత్తు 23 అడుగులు. నిమిషాల ముల్లు 14 అడుగులు, గంటల ముల్లు 9 అడుగులు.



Photo by P. R. Shinde



బహుమతి
పొందిన వ్యాఖ్య

రాళ్ళన్నీ జీవాలయితే

పంపినవారు :
కె. పార్థసారధి, వైజాగ్

Photo by Madan Gopal



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఊళ్ళన్నీ మేయవూ?

పంపినవారు:
కె. పార్థసారధి, వైజాగ్

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1964 జులై నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ మే నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

## మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : రాళ్ళన్నీ జీవాలయితే

రెండవ ఫోటో : ఊళ్ళన్నీ మేయవూ?

పంపినవారు : కర్రి పార్థసారధి,

మహారాణీపేట, విశాఖపట్టణం - 2

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.


Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# మీ బిడ్డ పెరుగుదలను అరికట్టే అజీర్తిని అలక్ష్యం చెయ్యకండి!

# అమృతాంజన్

లిమిటెడ్ వారి

# గ్రైప్ మిక్శ్చర్




మీ బిడ్డ పాకటం, కూచోటం, నిలబడటం, నడవటం నేర్చుకోవాలి, తూకం రెట్టింపు పెరగాలి-అన్నీ తొలి యేడాదిలో! మీ బిడ్డ ఆరోగ్యంగా పెరగటానికి జీర్ణశక్తిలో స్వల్పలోపం కూడా అభ్యంతరం కలిగించకుండా మీరు శ్రద్ధ వహించాలి.

అజీర్ణ సూచన కనిపించగానే మీ బిడ్డకు అమృతాంజన్ గ్రైప్ మిక్శ్చర్ ఇవ్వండి. దానివల్ల, పళ్లు వచ్చేటప్పుడు కూడా ఏమీ చిరాకు కలగకుండా ఉంటుంది.

జ్ఞాపకం ఉంచుకోండి, అమృతాంజన్ గ్రైప్ మిక్శ్చర్ తయారు చేస్తున్నవారు సుప్రసిద్ధమైన నొప్పుల నివారిణి అమృతాంజన్ తయారు చేసే వారే. మీరు నిస్సందేహంగా వాడవచ్చు.

అమృతాంజన్ లిమిటెడ్, మద్రాసు, బొంబాయి, కలకత్తా, న్యూ ఢిల్లీ

JWT/AM/G/2615 A



# కేశవర్ధిని

వాడితే నిడుపాటి నిగనిగలాడే కేశములు పెరుగును. జీవరహితమైన శిరోజాలకు క్రొత్త అందము వచ్చును. చక్కటి సువాసన గల కేశవర్ధినితో ఆరోగ్యవంతమైన కురులను సృష్టించుకోండి.

## కేశవర్ధిని రెడీ మిక్స్‌డ్ హెయిర్ ఆయిల్

ఇప్పుడు క్రొత్తగా ప్రవేశపెట్టబడినది. ఎన్నెన్నో సుగుణాలు గల కేశవర్ధిని షాంపూను ప్రతి ఆదివారం తప్పక వాడుట నియమంగా పెట్టుకొనండి.

తయారుచేయువారు: **కేశవర్ధిని ప్రాడక్ట్స్,** జైల్ రోడ్, కోయంబత్తూరు-1



అలంకారానికి

# శారదా ఆభరణములు

(రిజిష్టర్డు)

## బంగారు కవరింగ్ చేయబడినవి.

మా శారదా నగలను కొని మీ ధనాన్ని పొదుపు చేసి గౌరవప్రదమైన జీవితాన్ని పొందగలరని ఆశిస్తున్నాము.



























**శారదా గోల్డు కవరింగ్ వర్క్సు REGD.**

prop. G.V. సత్యనారాయణమూర్తి & సన్సు

చిలకలపూడి, పోస్టు, మచిలీపట్నం, ఆంధ్ర.

A.V.RAO

ASP/GM/K-3L, TEL

# ఆహా ... కోలినోస్

Kolynos

## హాయినిగొలిపే స్వచ్ఛమైనది...

కోలినోస్ రుచి!
నాలుక ఝల్లుమనే ఆహ్లాదం
కోలినోస్ నురుగు!
తోముకొనుట తేలికచేయును, పూర్తిగా శుభ్రపరచును
కోలినోస్ యిచ్చే సుగంధ శ్వాస!
మీకు, యితరులకు ఎంతో యిష్టం

ఆ ఐదో ఆమెకు ఒక్క కిటుకు. కోలినోస్ వాడి, ఒక్క చిరునవ్వు, అందరిలాగే! ప్రతి రాత్రి కోలినోస్ డెంటల్ క్రీమ్‌తో పండ్లు తోముకొనండి... సహజంగా ప్రతి ఉదయము.
- ఈ సహవాసంలో అధిక విశ్వాసము...అధిక ఉల్లాసము.



## మధురమైన చిరునవ్వులు... కోలినోస్ చిరునవ్వులు

రిజిష్టర్డ్ యూజర్: జెఫ్రీమేనర్స్ అండ్ కంపెని లి.

BI-TFN-6 TEL



అలసట పోయి
హుషారు కలగాలంటే...

మీరూ అంగీకరిస్తారు

# టాటా-ఫిన్లే
## టీ

సాటిలేని టీ!

టాటా-ఫిన్లే టీ కంటె తృప్తికరమైన దేముంది! ఇందుకు కారణాలు:—

### తాజా టీ
తాజాగా వుంచుటకు టాటా-ఫిన్లే టీని ప్రత్యేకమైన ప్యాకింగ్‌లో సురక్షితముగా భద్రపరచుతారు.

### పరిమళమైన టీ
అతి సున్నితమైన పరిమళమిచ్చుటకు కావలసిన కోమలమైన ఆకులను మొగ్గలనే టాటా-ఫిన్లే టీలో ఉపయోగిస్తారు.

### ఉత్తమ టీ
టాటా-ఫిన్లే టీ మిశ్రణ (బ్లెండింగ్) అతి నిపుణతతో చేస్తారు. కనుకనే ఈ టీ చిక్కగా రుచికరంగా వుంటుంది.

**టాటా-ఫిన్లే** *టీ త్రాగండి; ఆనందము అందుకోండి!*



ఈ క్రింది రకాలలోను, ప్యాకింగ్సులోను టాటా-ఫిన్లే టీ దొరుకుతుంది:-
ప్రెస్టీజ్ డార్జిలింగ్—సుందరమైన టిన్
లబిర్—బంగారు రంగు ప్యాకెట్
మిలాప్—వెండి రంగు ప్యాకెట్
బహదూర్-నారింజ రంగు ప్యాకెట్
షాన్—పీలి రంగు ప్యాకెట్



